# విస్డమ్
అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసపత్రిక

సంపాదకవర్గం

సంపాదకుడు:
లయన్ కె.వి.గోవిందరావు

గౌరవ సహాయ సంపాదకులు:
టి.ఎల్.ఎన్.రావు బి.ఎస్.సి
వి.బాలకుమార్

సభ్యులు:
కె.వి.ఎస్.గోవిందరావు
కె.వి.ఎస్.శరత్ బాబు
కె.వి.ఎస్.విజయకుమార్
కె.రత్నకుమారి

చందా వివరాలు

| | |
|---|---|
| శాశ్వత చందా | 1000.00 |
| జీవిత చందా | 250.00 |
| 3 సంవత్సరాలకు | 52.00 |
| సంవత్సర చందా | 18.00 |
| ఎయిర్ మెయిల్ (1 సంవత్సరం) | 80.00 |
| సీ మెయిల్ (1 సంవత్సరం) | 45.00 |

చందా పంపవలసిన చిరునామా

విస్డమ్
6 దేశికా రోడ్డు మైలాపూరు,
మద్రాసు-600004


# ఈ సంచికలో

అగస్టు 1985



★

ముఖచిత్రం-కలర్ ట్రాన్స్‌పరెన్సీ:
ఎన్. శివన్నారాయణ, మద్రాసు-17.

**తెలుగు విస్డమ్‌కు ఇది నాల్గవ సంవత్సరం**

# ధ్యానం

## శక్తివంతమైన దివ్యప్రేమ దిగ్విజయ సాధనం



జేమ్స్ ఎలెన్

నిష్పాక్షికమైన శాంతియుత స్వభావాన్ని అలవరుచుకో. పవిత్రమైన అనుతాపాన్ని పొందు. మృదువుగా మట్లాడటం నేర్చుకో. అప్పుడు పరమపావనమైన ఆత్మశాంతితో దివ్యప్రేమను అనుభవించి ఆనందించగలవు. మధురమైన ప్రవర్తనతో స్వార్థపరతను వదలుకుంటే ఇతరులను సమ్మతింపజేయగలవు. శుష్కవాదాలకు ఉపక్రమించకుండా పరులకు బోధించగలవు. విజ్ఞులు నిన్ను గౌరవిస్తారు. ఇతరుల అభిప్రాయాలకు లొంగిపోకుండా

(మిగతా 8 వ పేజీలో)

# సంపాదకుని పేజీ

## మార్చుకోలేని విషయాలను పరిగ్రహించుకో

చాలామంది తమ తమ తప్పులను, అపరాధాలను ఒప్పుకుని సమాధానం పొందడానికి అంగీకరించరు. తమ కోరికలను వదలుకోలేక ఏవేవో సాకులను చెప్పుకోడానికి ప్రయత్నిస్తారు. అటువంటివారు అనేక బాధలకు, కోపతాపాలకు, ఆగ్రహాలకు, విరోధాలకు గురి అవుతారు. విచ్ఛిన్న సంబంధాలను, స్నేహాలను, ఆమాటకొస్తే విడిపోయిన జీవితాలను సరిదిద్దుకోడానికి ఒక వ్యక్తి అనేక కష్టాలను అనుభవిస్తూ కంటకమయమైన వాస్తవాన్ని వదులుకోవలసి వస్తుంది.

మొట్టమొదట ఇలా సమాధాన పడటం కష్టమనిపించవచ్చు. కానీ ధైర్య స్థైర్యాలతో,

---

## X-రే టోమోగ్రాఫ్

రష్యాలో సోవియెట్ శాస్త్రజ్ఞులు కనిపెట్టిన X-కిరణ టోమోగ్రాఫ్ ఒక రోగి మెదడులో రోగ ప్రారంభాన్ని అతి కచ్చితంగా వైద్యులు తెలుసుకుని తగిన చికిత్సకు ఉపక్రమించటానికి సహాయపడుతుంది. ఈ క్రొత్త పరికరం ఎలక్ట్రానిక్ కంప్యూటర్ సహాయంతో రోగి మెదడు యొక్క ప్రతిబింబం తెరమీద తెలియజేసుంది.

"పురుషులు చట్టాలు ఏర్పరిస్తే స్త్రీలు మర్యాదలు నిర్ణయిస్తారు." —డి సెగుర్

అనందమయమైన పర్యవసానాన్ని అర్థం చేసుకోగలిగిన వ్యక్తి అపరిమితమైన ప్రతిఫలాన్నిచ్చే సక్రమమార్గంలో



ముందుకు సాగగలుగుతాడు. సద్వివేకం లేని ఉదాసీనత పరిగ్రహణం కాదు. పరిగ్రహణలో విచక్షణ ఉంటుంది. మొదటి ఆశాభంగానికి నిరాశపడిపోకుండా ఆమోదించ గలిగినప్పుడు మానసిక స్వేచ్ఛను అనుభవించగలరు. ఇట్టి స్వేచ్ఛ ఇతోధిక నవోద్యమాలకు దోహదకారి.

పరిగ్రహించాలి; ఆశాభంగాలను మరచిపోవాలి. ధైర్యంతో ముందడుగు పెట్టాలి. అనేకమంది మహనీయులు ఈ మార్గాన్ని

చేసుకొన్నారు. ఒకనాడు తనను దర్శనం చేసుకోడానికి వచ్చిన ఒక వ్యక్తితో అమెరికా అధ్యక్షుడు అబ్రహాంలింకన్ ప్రజాయుద్ధాన్ని నివారించడానికి తాను విమర్శలను, ప్రకంపనలను లెక్కచేయక తన ధర్మాన్ని తాను నిర్వహిస్తున్నానని చెప్పాడు.

పరిగ్రహణకు ప్రతిఫలంలాగే అపరిగ్రహణకు ప్రాయశ్చిత్తం ఉంది. జీవితంలో ప్రతి విషయం మనం కోరిన విధంగా కొనసాగదనే వాస్తవాన్ని తెలుసుకోవడమే వివేకం.

పరిగ్రహించడం కష్టసాధ్యమని తోచినప్పుడు, బలవంతమైన విషయాన్ని ఆమోదించక తప్పనిసరి అయినప్పుడు "దైవమా! మార్పుచేయగల దానిని మార్చుకొనుటకు తగిన శక్తి నాకు ప్రసాదించు. మార్చుకొనుటకు వీలులేని వాటిని పరిగ్రహించడానికి ధైర్యాన్నీ, వివేకాన్ని కలిగించు" అని ప్రార్థించండి. ●

(2 వ పేజీ తరువాయి)

మధురమైన ప్రేమతో వారిని జయించగలుగుతావు. శక్తివంతమైన దివ్య ప్రేమ దిగ్విజయ సాధనం. మృదు మధురమైన మాటలు, మేలైన చేతలు, సదభిప్రాయాలు ఎన్నటికీ నశించనివి; శాశ్వతమైనవి. ●

## సుప్రీం కోర్టులో పెండింగులో ఉన్న కేసులు

డిసెంబరు 31, 1984 నాటికి సుప్రీం కోర్టులో మొత్తం 1,48,881 కేసులు పెండింగులో ఉన్నాయి. వీటిలో 1,02,023 కేసులు ఎడ్మిషన్లు, మిసిలేనియస్ వ్యవహారాలు మరియు 46,868 హియరింగుకు సంబంధించినవి.

"బలహీనుడైన స్నేహితుడి కంటే బలవంతుడైన విరోధి ఎన్నోరెట్లు మేలు." —ఎడ్వర్డ్ డాల్ బెర్గ్

# భూమి పరిణామం

డా॥ కె. ఎన్. ప్రసాద్

గ్రీకుల కాలం నుంచీ భూమి వయస్సు ఇద మిద్ధమని నిర్ధారణ చేయబడలేదు. మొట్ట మొదట 18వ శతాబ్దంలో విజ్ఞానం శాస్త్ర రీత్యా భూమి వయస్సును మదింపు చేయ



డానికి ప్రయత్నాలు కొనసాగాయి. ఆ నాడు కొంత పరిమాణం గల వేడిచేసిన ఇనుము, ఇతర వస్తువులు చల్లబడడానికి పట్టిన సమయాన్ని ఉపయోగించి భూమి చల్లబడ డానికి పట్టేకాలాన్ని మదింపు చేసారు.

ఆధునిక మదింపు విలువలు 40.000 మొదలు 80.000 లక్షల సంవత్సరాలుగా నిర్ణయింపబడ్డాయి. ఈ విలువలు ముఖ్యంగా భూమియొక్క మరియు సూర్యునియొక్క ఉష్ణము తగ్గుదల రేటు, కొండలు-రాతి గుట్టలు ఏర్పడే రేటు, సముద్రపు నీటియొక్క క్షారత మరియు క్షారత మార్పురేటు మీద ఆధారపడి ఉన్నాయి. యురేనియం ఐసోటోప్‌గా మారి వచ్చే కొండల్లో రేడియో ధార్మిక ద్రవ్యాలు మందకొడిగా, నిలకడగా క్షయాన్ని పొందు తాయి. ప్రత్యేక పరికరాలు, రాసాయనిక విధా నాలు రాతి కొండలలో రేడియో ధార్మిక పదా ర్థాలను తెలుసుకోడానికి సహకరిస్తాయి.

## నమ్మలేని నిజాలు

రాత్రిపూట గుడ్లగూబ మానవుని కన్న 100 రెట్లు బాగా చూడగలదు.

• • •

ఒకేసారి తుమ్ముతూ ఎవరూ కళ్ళు తెరచి ఉంచలేరు.

• • •

భూభాగంలో 70 శాతంపైబడి సముద్రం చేత కప్పబడిఉంది.

• • •

మానవ శరీరం భారంలో మూటికి రెండు వంతులు నీటిదే.

• • •

మిక్కిలి నిడుపైన మెడగల జిరాఫీకి మానవుని కంఠంలో లాగే 7 ఎముకలే ఉంటాయి.

• • •

అమెరికా ఫ్లొరిడాస్టేట్ యూనివర్సిటీ వర్జిల్ కొన్నెర్‌కి 92 వ ఏట చరిత్రలో పి. హెచ్. డి. ఇచ్చి గౌరవించింది.

"సుస్పష్టంగా చూడడానికి సులోచనాలను వేసుకునేవారు ఇతరులు నిర్దుష్టంగా చూడలేరనుకోకూడదు." —జాన్ లాక్

ఐసోటోపుల అధ్యయనం వల్ల కూడా భూమియొక్క వయస్సును మదింపు చేయవచ్చు. భూమిపైన ఏర్పడిన గట్టిపొర అనేక అగ్నిపర్వతాలలో నుంచి పైకి వచ్చి ప్రవహించిన లావా వల్ల ఏర్పడి ఉండాలి. ఈ లావా మిక్కిలి ఉష్ణంగా ఉండే ద్రవపదార్థం



మాంసాహారి డినోసోర్

మాగ్మా (Magma). ఈ మాగ్మా క్రమంగా చల్లబడి భూభాగం ఏర్పడి ఉండాలి. ఒకప్పుడు ఒకటిగా చేరి ఉన్న ఈ భూభాగం రాను రాను ఉత్తర ఖండం, దక్షిణ ఖండం అనే రెండు భూఖండాలుగా ఏర్పడింది.

లారేటియా (Lauretia) అనే ఉత్తర ఖండం, గోండ్వానా (Gondwana) అనే దక్షిణఖండం (మధ్యప్రదేశ్‌లోని గోండ్ సామ్రాజ్యంలో నివసించే ఆదిమజాతుల నుంచి ఏర్పడ్డ పేరు) అను రెండు ముఖ్య భాగాలు ఏర్పడినట్టు భూగర్భ శాస్త్రజ్ఞుల అభిప్రాయం. ఈ రెండు భూభాగాలు టిథెస్ మహాసముద్రం(ఇప్పటి మధ్యధరాసముద్రం) చేత 2,000 లక్షల సంవత్సరాలకు పూర్వం వేరుచేయబడ్డాయి. ఈ భూఖండాలు ఎప్పుడూ స్థిరంగా ఉండవు. ఉత్తరముఖంగా జరుగుతూ 2,000 లక్షల సంవత్సరాల కాల వ్యవధిలో (ప్లేట్ టెక్టానిక్ సూత్రం) అనేక ఖండాలుగా విడిపోయాయి.

హిందూదేశం 2,000 లక్షల సంవత్సరాలకు పూర్వం 2,600 కిలోమీటర్లు ఉత్తరముఖంగా జరిగిపోయి అంటార్కిటికా నుండి విడిపోయింది. ఇదేవిధంగా దక్షిణ అమెరికా, ఆఫ్రికా, ఆస్ట్రేలియాలు విడిపోయి విడిగా ఏర్పడ్డాయి. ఇవే నిజమైతే చల్లగా మంచుతో గట్టిపడిపోయి ఉన్న అంటార్కిటికా హిందూదేశానికి చెందినదని చెప్పడానికి నిదర్శనాలు

## అజీర్తికి విరుగుడు

అజీర్ణం అనేక కారణాలవల్ల ఏర్పడవచ్చు. ఎక్కువగా మామిడిపళ్ళు తిని అజీర్ణంతో బాధపడుతుంటే పాలు త్రాగండి. ఎక్కువగా నెయ్యి తిని అజీర్ణంతో బాధపడుతుంటే నిమ్మరసం సేవించండి. అరటిపళ్ళు తిని అజీర్ణంతో బాధపడుతుంటే ఒక చిటికెడు ఉప్పుతినండి. కేకులు తినడంవల్ల అజీర్ణం కలిగితే వేడినీళ్ళు త్రాగండి. పాలవల్ల అజీర్ణం చేస్తే మజ్జిగ త్రాగండి. పనస తొనలవల్ల అజీర్ణం చేస్తే రెండు అరటిపళ్ళు తింటే తగ్గిపోతుంది. కొబ్బరికాయ తిని అజీర్ణంతో బాధపడుతుంటే కొద్దిగా బియ్యం తింటే సర్దుకుంటుంది. బాదంకాయలు తిని అజీర్ణం సంభవిస్తే కడుపునిండా నీళ్ళుత్రాగితే చాలు. నీళ్ళు త్రాగితే అజీర్ణం చేస్తే తేనె కొద్దిగా తీసుకోండి.

"అభిలాష లేకపోతే పరిశ్రమే ఉండదు." —జాన్ లాక్

ఏవి: ఈ విదర్శనాలు (అంతరించిపోయిన జంతువుల మరియు మొక్కల) శిలా పరిణామావశేషాలు. మానవుని పోలిన లిస్ట్రో



శాఖాహారి డినోసోర్

సరస్ (Lystrosaurus) ప్రాకే జంతువు, గ్లాసోప్టెరిస్(glossopteris: నాలుక వంటి ఆకులుగల చెట్లు) యొక్క అవశేషాలు ఇండియాలోనూ, అంటార్కిటికాలోనూ కనిపిస్తున్నాయి. కాబట్టి పూర్వం ఒకప్పుడు ఈ రెండూ చేరి ఉండి, తేమతో కూడిన ఉష్ణవాతావరణం కలిగి ఉండి నట్లు నిర్ణయించబడింది. భూతలం స్థిరపడినప్పుడు జీవపరిణామం ప్రవృద్ధి పొంది ఉండాలి. ఈ సమయంలో మానవుడు ప్రవృద్ధి పొందలేదు. ఆ నాటి అతి ప్రాచీన మైన జీవం ఏకకణ సూక్ష్మజీవి. ఇది 26,000 లక్షల సంవత్సరాలకు పూర్వం అత్తి చెట్టు మీది సూక్ష్మజీవి. ఆంధ్రప్రదేశ్‌లోని కడప ప్రాంతాలలో సున్నపురాతి (15,000 లక్షల సంవత్సరాలు)లో నాచు, ఇతర చిన్న చిన్న మొక్కలు కనుగొనబడ్డాయి. 6,000 లక్షల సంవత్సరాలకు పూర్వం భూమి పరిణామావస్థ పూర్తికాబడిందనే చెప్పుకోవచ్చు.

మొట్టమొదట పరిణామం 3.000 లక్షల సంవత్సరాలకు పూర్వం సముద్రంలో ప్రారంభమై క్రమక్రమంగా జంతువులు, మొక్కలు భూమిమీద బయలుదేరాయి.

భూమి పరిణామ చరిత్రను సంపూర్ణంగా అవగాహన చేసుకోడానికి భూగర్భ శాస్త్రజ్ఞులు భూమియొక్క పరిణామ చక్రాన్ని రాళ్ళు శిలాపరిణామాలనుబట్టి ఎజోయిక్ (Azoic), పేలియోజోయిక్ (Palaeozoic), మెసోజోయిక్ (Mesozoic), సెనోజోయిక్ (Cenozoic) అని నాలుగు దశలుగా విభజించారు. 25,000 లక్షల సంవత్సరాల పరిమితిగల మొదటి ఎజోయిక్ దశలో భూమి మీద ఎటువంటి ప్రాణీలేదు.

రెండవ పేలియోజోయిక్ దశపరిమితి 6,000 లక్షల సంవత్సరాలు. ఈ కాలంలో

## మానవ నిర్మితమైన మొట్ట మొదటి కృత్రిమ తోకచుక్క

సౌరకుటుంబంలో ఇంకా ఎక్కువ వివరాలు తెలుసుకోడానికి మానవ నిర్మితమైన మొట్టమొదటి తోకచుక్క గత డిసెంబరులో అంతరిక్షంలోకి పంపబడింది. అమెరికా, బ్రిటన్, పశ్చిమ జర్మనీలు పాల్గొనే ఈ పరిశోధనలవల్ల భూమి కాంతిక్షేత్రంలో సౌర వాయు ప్రతిచర్య తెలుసుకోడానికి వీలవుతుంది.

"అందరూ ప్రబోధకులే. తమను తాము మాత్రం ఉద్ధరించుకోలేరు." — జర్మన్ సామెత

సూక్ష్మజీవులు, వెన్నెముకలేని జంతువులు, చేపలు, ఉభయచరాలు, ఆదిమ సరీసృపాలు మొదలైనవి. భూమిమీద, సముద్రాలలోను బయలుదేరాయి.



కొమ్ముల డినోసోర్

తరువాత 1,200 లక్షల సంవత్సరాల కాలపరిమితి గల మెసోజోయిక్ దశలో రక రకాల 45 అడుగుల ఎత్తు 80 అడుగుల



పెద్ద రాకాసి ఏనుగు

పొడవుగల బ్రాకియోసోరస్ (Brachio-saurus), 70 అడుగుల పొడవుగల పిడుగు బల్లి బ్రోంటోసోరస్ (Brontosaurus) వంటి రాకాసి డినోసోరులు భూప్రదేశంలో అనేకచోట్ల బయలుదేరాయి. బ్రోంటోసోరస్ బ్రాకియోసోరస్‌లాగే తేమ ప్రదేశాల పరిసరాలలో నివసించే శాకాహారి డినోసోరు. టైరానోసోరస్ (Tyrannosaurus) మిక్కిలి భయంకరమైన మాంసాహారి డినోసోరు. 25 అడుగుల ఎత్తు, 50 అడుగుల పొడవు కలిగి వాడియైన గోళ్ళతో అతి బలిష్ఠంగా ఉంటుంది. ఇది చాలా అపాయకరమైన జంతువు 6 అంగుళముల పొడవైన రంపపు పళ్ళతో పెద్ద నోరు కలిగి ఉంటుంది. అతి సులభంగా మాంసాన్ని చీల్చి తింటుంది. ఇతర డినోసోర్‌లను కూడా తినగలదు.

కొమ్ముల డినోసోరస్ (Triceratops)
ప్లేయిటెడ్ డినోసోరస్ (Stegosaurus)
ఆర్మర్డ్ డినోసోరస్ (Ankylosaurus)



"తక్కువ చూసేవారు చూడదగిన దానికన్న తక్కువగానే చూస్తారు. చెడు వినేవారు వినదగిన దానికన్నా ఎక్కువగానే వింటారు. —సిచే

వంటివి కూడా ఉండేవి. 600 లక్షల సంవత్సరాలకు పూర్వమే ఈ జంతువులన్నీ అంతరించిపోయాయి ఆంధ్రప్రదేశ్, మధ్యప్రదేశ్ మరియు తమిళనాడులలో శిలాపరిణామం చెందిన వీటి అస్థిపంజరాలు కనిపించాయి.



నాలుగు కొమ్ముల జిరాఫీ

600 లక్షల సంవత్సరాల పరిమితిగల చివరి దశకు వచ్చేటప్పటికి ఏనుగులు, జిరాఫీలు, డినోసోరస్. పులులు, మానవుని పోలిన కోతులు మొదలైన ఉష్ణరక్తపు జంతువులు వచ్చాయి. మొట్టమొదటి ఏనుగు పంది పరిమాణంలో ఉండేది. కాని తరువాత ఉత్తరప్రదేశ్, హిమాలయ ప్రాంతపు పివాలిక్ అడవులలో 11½ అ పొడవు, 3½ అ. వైశాల్యంగల పెద్ద దంతాలతో పెద్ద పెద్ద ఏనుగులు స్టెగోడన్‌గణేశ వంటివి నివసించాయి. 18 అడుగుల ఎత్తుగా వుండే రినోసోరస్, బాలూచీథీరియం (Baluchi - therium), నాలుగు కొమ్ముల జిరాఫీలు (పివాథీరియం) హిమాలయ ప్రాంతాలలో సాధారణంగా కనిపించేవి. 20 లక్షల సంవత్సరాలకు పూర్వం పైదవడలో 6 అంగుళాలపొడవైన కత్తులవంటి కోరలుగల పులులు అన్నిజంతువులను పట్టి చంపేవి. 80 - 100 లక్షల సంవత్సరాలకు పూర్వం హిమాలయ ప్రాంతాలలో మానవుని పోలిన కోతులు (రామపిథికస్) నివసించాయి.

ఈ అద్భుతమైన జంతుజాలం నేడు ఏమైంది? ఎందువల్ల బ్రతక లేదు? దీనికి ముఖ్య కారణం, 15 లక్షల సంవత్సరాలకు పూర్వం మంచుయుగం ఏర్పడింది మానవుడు పుట్టాడు కొన్ని లక్షల సంవత్సరాలుగా రూపొందిన జంతువులకంటే తెలివితేటలు, ప్రజ్ఞ ఇతడికి లభించాయి. ●

## 14వ శతాబ్దానికి చెందిన గ్రంథం 300 సం. ల తర్వాత దొరికింది

14వ శతాబ్దానికి చెందిన ఆంగ్లకవి జియోఫ్రీ ఛాసర్ (Geoffrey chaucer) రచించిన గ్రంథాలు సంపూర్ణంగా 1602 వ సం.లో ప్రచురింపబడ్డాయి. ఇవి ఆ నాడు దొంగలు దొంగిలించిన తరువాత 300 సంవత్సరాలకు దొరికింది. 1642-51 సం.ల మధ్య జరిగిన ఆందోళన ఫలితంగా ఇది ఎన్నో చేతులు మారింది. చివరకు 1824 సం.లో పోయినట్టుగా నిర్ధారణ చేయబడింది. కొద్ది మాసాల క్రితం లండన్‌లోని హెన్రీ సదరన్ గ్రంథ విక్రయ శాలలో ఈ పుస్తకాలను కనుగొన్నారు. ఒక అభిమాని బాగా సొమ్ము వెచ్చించి దాన్ని కొని కెథిడ్రల్‌లో పెట్టాడు.

# కోణార్కసూర్యదేవాలయం

మారెళ్ళ మల్లికార్జునరావు

పూరీకి ఈశాన్యంగా బంగాళాఖాతం ఇసుక దిన్నెమీద కోణార్క్‌లో నిర్మింపబడిన సూర్యదేవాలయం మిక్కిలి ప్రసిద్ధిపొందినది. ఇది ఒరిస్సా శిల్పకళా సౌందర్యాన్నీ, నైపుణ్యాన్నీ చాటుతూంది. దూరంనుంచి చూచినప్పుడు ఇది నల్లగా కనిపిస్తుంది కాబట్టి దీనిని



సూర్యభగవానుడు

నల్లగుడి (Black pagoda) అని కూడా అంటారు. కోణ అంటే మూల, అర్క అంటే సూర్యుడు. కోణార్క అంటే మూల తెలిపిన సూర్యుడు అని అర్థం. కోణార్క అనే మాటే కొనారక్‌గా మారింది. ఇచ్చట ప్రతి సంవత్సరం జూన్ మాసంలో జరిగే రథోత్సవం ప్రపంచ ప్రఖ్యాతిని పొందింది. సూర్యదేవుని పూజ అతి ప్రాచీనమైనది. సర్వరోగహరుడును, సమస్త కోరికలను ఫలింపజేయువాడును, సకల జీవరాశికి మూలమును అగు సూర్యభగవానుడు లోకనాథుడు, జగత్కర్త.

పూరీ జగన్నాథ దేవాలయంలో ఉన్న తాళపత్ర గ్రంథాన్ని (మాదలపంజి) బట్టి క్రీ. శ. 1235 నుండి క్రీ. శ. 1287 వరకు రాజ్యంచేసిన గంగవంశీయులైన లాంగూల నరసింహదేవ్‌రాజు 1278 వ సంవత్సరంలో కోణార్క్‌లో ఈ సూర్యదేవాలయ నిర్మా

---

## శిక్షలో ఉండగానే కిరీటం పెట్టారు

బైజాన్సీకి చెందిన మైకేల్ II పెల్లిస్‌ను రాజద్రోహానికి 820 సం.రం లో క్రిస్టమస్ రోజున ఉరితీయాలని ఆజ్ఞాపించారు. ఉరితీయడానికి అధికారి వచ్చే ముందు మైకేల్ అనుచర సైన్య బృందం చేరి అతనిని రక్షించారు. వెంటనే అతనిని రాజప్రాసాదానికి తీసుకుపోయి కిరీటం పెట్టారు.

"ఒక స్నేహితుణ్ణి తృప్తిపరచలేని వ్యక్తి
జీవితంలో విజయవంతుడు కాలేడు." —థోరో

దాన్ని పూర్తిచేసినట్లు తెలుస్తూంది. సుమారు 700 సంవత్సరాలకు పూర్వం ఏ సాధన సౌకర్యాలు, రోడ్డు రవాణా సదుపాయాలు లేని కళింగదేశపు (ఒరిస్సా) శిల్పులు దూర ప్రదేశాలనుండి దేవాలయ నిర్మాణానికి పెద్ద



కోణార్క సూర్యదేవాలయం

పెద్ద రాళ్ళను తెచ్చి మిక్కిలి ఎత్తైన ప్రదేశం మీద ఈ దేవాలయాన్ని కట్టించడం మిక్కిలి ఆశ్చర్యకరమైన విషయం. కాలగతిని అంతరించిపోయిన ఆనాటి నదీ ప్రవాహంలో తెప్పలమీద ఈ రాళ్ళను రవాణాచేసి ఉండవచ్చు ఒక్క ఒరిస్సాలోనే గాక భారత దేశమందంతటా దేవాలయాలన్నిటి కంటే మిక్కిలి ఎత్తైన సూర్యదేవాలయం మహోన్నత ఆశయాలతో ఒక గొప్ప ప్లాన్‌ను అనుసరించి కట్టబడింది.

అరుణోదయమప్పుడు మొదటి సూర్య కిరణం ఆలయం గుండా ప్రసరించి గర్భాలయంలో మూల విరాట్టుమీద పడేటట్లు నిర్మించడం వాస్తవంగా ఆనాటి ఒరిస్సా శిల్పుల

## ప్రపంచంలో మిక్కిలి ఎత్తైన డాము

రష్యా తజికిస్తాన్‌లో నిర్మాణంలో ఉన్న రోగున్‌స్కీ డామ్ ఎత్తు 1,068 అడుగులు ఉంటుంది. ప్రపంచంలోనే ఇది మిక్కిలి ఎత్తైన డామ్. 1973 సంవత్సరం నుంచే నిర్మించబడుతూన్న ఈ డామ్ నిర్మాణం కొద్ది మాసాలలో పూర్తి కాగలదు.

"ఒక శతాబ్దపు తత్త్వజ్ఞానం దాన్ని అనుసరించి వచ్చే శతాబ్దపు సామాన్య జ్ఞానం."

— హెన్రీవార్డ్ బీచర్

కళానైపుణ్యం, హస్త విన్యాసం తెలియ చేస్తుంది. ఈ ప్రథమ కిరణం ఆలయానికి ఎదురుగా .నిర్మింపబడ్డ ఏడు గుఱ్ఱాల మీదుగా ప్రసరించి గుడిలోపలి సూర్య విగ్రహం మీద పడుతుంది.



రథచక్రం

పౌరాణికంగా సూర్యభగవానుడు తన రథంమీద ఆకాశవీధిలో సంచరిస్తాడు. కాబట్టి ఇచ్చటి దేవాలయం పెద్ద రథం ఆకారంలో కట్టబడింది
ప్రక్కలా శిల్పకళా సౌందర్యంతో నిండిన 12 జతల చక్రాలు ఉంటాయి. రథరూపంలో ఉండే దేవాలయం ముందు జీవకళలు ఉట్టి పడే సప్తాశ్వాలు రథాన్ని లాగటానికి సంసిద్ధంగా ఉంటాయి. ఈ 24 చక్రాలు ఒకరోజులో ఉండే 24 గంటలను, సప్తాశ్వాలు 7 దినాలను సూచిస్తాయి. ఒక సంవత్సరంలో ఉండే 24 పక్షాలకు 24 చక్రాలు, 7 గుఱ్ఱాలు సూర్యరశ్మిలో గల సప్తవర్ణాన్ని సూచిస్తాయని కూడా కొందరు చెపుతారు. ఒక్కొక్క చక్రానికి ఉండే 8 ఆకులు ఒక రోజులో ఉండే 8 ప్రహారములు. చక్రం వాస్తవంగా ఒక సౌరఘటిగా యంత్రం. పగలు ఆకాశంలో సూర్యుని గతిని అనుసరించి ఉండే ఈ చక్రాన్ని చూచి కాలమానం తెలుసుకోవచ్చు. ఇంతేగాక సకల జీవరాశికి చైతన్యశక్తి సూర్యుడు. అందువల్లనే ఈ సూర్యదేవాలయంలో సకల జీవరాసులు అందాలు చిందేట్టు చెక్కబడ్డాయి. ఇచ్చటి గర్భగుడి (విమానం) 68 మీటర్ల ఎత్తుంటుంది. జగమోహన మంటపం 30 కి.మీటర్ల చతురం, 30.8 మీటర్ల ఎత్తుగల స్థూపాకారంలో నిర్మించబడింది.

మూల దేవస్థానం, జగమోహన మంటపం ఒకే పీఠం మీద ఉంటాయి. నాటమందిర్‌ని

## మీరైతే...?

(జూన్ - 1985)

(అంతరిక్షంలో అణుయుద్ధం జరిగితే?)

"రాకేషును పంపించి
రాయభారం చేయిస్తా!"
—డి.వి.ఎమ్. సత్యనారాయణ, దొడ్డవరం.

* * *

"ఆకాశానికి భూమికి మధ్య 'విస్డమ్'ని పేర్చి ఈ ప్రపంచాన్ని రక్షిస్తా!"
—అనంత వెంకటేశన్, మచిలీపట్టణం.

* * *

"ప్చ్! రాకేష్ శర్మకు ఫోన్‌చేస్తా!"
—ఎమ్. విజయభాస్కర్, సంతకవిటి పోస్టు.

భోగమంటపం (నైవేద్య మందిరం) అంటారు. ఇది కూడా పైవాటితో ఒకే ఇరుసులో ఉన్నా వేరే పీఠం మీద ఉంటుంది. ఇప్పుడు గర్భగుడి, నాటమండిర్ పైకప్పులు శిథిలమైపోయాయి. జగమోహన మంటపం కూడా కొంత శిథిలమైనా ప్రాచీన శిల్పవైభవం ఈనాటికీ చెక్కు చెదరలేదు. ఇప్పటి గోడల మీద చెక్కబడిన నిలువు ఎత్తున ఉండే శృంగార నాయికా నాయకుల మొలక నవ్వులతో మోహాత్మకమై ప్రత్యంగ సౌష్టవంతో తీర్చిదిద్దిన స్త్రీ విగ్రహాలు కోణారక్ యాత్రీకులకు కన్నుల పండుగను చేకూరుస్తాయి. అతి విచిత్రంగా నాజూకుగా రాతిని చెక్కటానికి సూదులవంటి సన్నపాటి పనిముట్లను ఆనాటిశిల్పులు ఉపయోగించి ఉండాలి. సంగీత వాద్యాలతో మేళములు, సైనికుల కవాతు, వేట వినోదాలు, పల్లకిని మోస్తున్న బోయీలు, రాజ దర్బారు, ఋషుల తపస్సు, ద్రాక్షపళ్ళు తింటూన్న జిరాఫీలు మొదలైన రకరకాల దృశ్యాలు మిక్కిలి ఆనందాన్ని, ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. ఆలయానికి దక్షిణ దిక్కున రెండు పెద్ద గుఱ్ఱాలు, ఉత్తర దిక్కున ఏనుగులు చూసి తీరవలసిందే.

ఇట్టి మహోత్కృష్టమైన దేవాలయం ఎప్పుడు, ఎందుకు, ఎలా శిథిలమైందో నిర్ధారించలేం.

క్రీ శ. 1568 సం. లో కలపహాడ్ ఒరిస్సాపై దండెత్తి వచ్చి ఈ సూర్య దేవాలయాన్ని పడగొట్టినట్టు చెబుతారు ఇతడు తరివేటి (అర్చివి) ముందు పడగొట్టి సులభంగా ఆలయాన్ని ధ్వంసం చేయగలిగాడు. ఇప్పటికి అనేక సంవత్సరాలనుండి దేవాలయ ప్రదేశం ఇసుక మేటవేసుకుపోయి నిర్మానుష్యమైన ఒక అడవిలా పెరిగిపోయింది.

ఇటీవల 19 వ శతాబ్దం చివరి భాగంలో బ్రిటిషు ప్రభుత్వంవారు కోణారక్ ప్రశస్తిని గ్రహించి ఆలయ జీర్ణోద్ధరణకు పూనుకొన్నారు. ఈనాడు దేవాలయ సంరక్షణ మరియు అభివృద్ధికి తీవ్రమైన చర్యలు తీసుకోబడుతున్నాయి ●

## గుజరాత్ కొండపైన 863 పాలరాతి మందిరాలు



గుజరాత్ పలిటానాలో సముద్ర మట్టానికి 591 మీటర్ల ఎత్తులో 'షేట్రుంజీ పర్వతం' పైన 863 జైన దేవాలయాలు ఉన్నాయి. చక్కని శిల్పకళలు ఉట్టిపడే ఈ పాలరాతి దేవాలయాలన్నీ జైన మత గురువులైన తీర్థంకరులకు అంకితం చేయబడ్డాయి. పలిటానా దేవతలు నివసించే ఈ ప్రదేశంలో సూర్యాస్తమయం తరువాత మానవసంచారమే ఉండదు. పూజారులు కూడా ఉండరు!

"మహాత్ములు ఇతరుల దోషాలను వెదకరు
హీనులకు ఇతరుల దోషాలను వెదకడమే ముఖ్య వ్యాపారం." —తిరుక్కురళ్

# మూర్తులు

## త్యాగరాజు

దక్షిణ భారత సంగీతానికి ఎక్కువగా వ్యాప్తిని కలిగించిన త్యాగరాజు, శ్యామ శాస్త్రి, ముత్తుస్వామి దీక్షితులు ముగ్గురూ



శ్రీ త్యాగరాజస్వామి

అవతారమూర్తులు, కారణజన్ములు. వీరినే సంగీత త్రిమూర్తులనీ, రత్నత్రయమనీకూడా అంటారు. ముగ్గురూ తంజావూరులో తిరువారూరుకు సంబంధించిన సమకాలికులు. వీరు దేశంలో సుప్రసిద్ధ పుణ్యక్షేత్రాలను సందర్శించి, అప్పటి దైవములను సేవించి అనేక కీర్తనలను రచించారు. ముగ్గురూ అంతర్దృష్టి గల ఆధ్యాత్మిక తత్త్వవేత్తలు.

శ్రీ త్యాగరాజు తమిళనాడులో తంజావూరు జిల్లాలో తిరువారూరు గ్రామంలో క్రీ. శ. 1767 లో జన్మించారు. ఇతని తండ్రి

## భావపరిచయపోటీ

(జూన్ - 1985)

"రక్షక వాహనంతో
భక్షణం చేసింది 'విధే',
భిక్షకుణ్ణి లక్షాధికారిని చేసింది 'విధే'."
—పెంట సీతారత్నం, శ్రీకాకుళం.

* * *

"ఊహించని దురదృష్టం ఒకదిది:
అనుకోని అదృష్టం మరొకదిది."
—ఫణీంద్ర, తుంగభద్రాడామ్ (కర్ణాటక)

* * *

"కాపాడి కాపాడి కాలుడైనాడు
యాచించి యాచించి కుబేరుడైనాడు."
-ఎమ్.డి. ఇమాయుద్దీన్, నర్మెట, (మెదక్ జిల్లా)

"మానవుణ్ణి సంతోషపెట్టాలంటే అతడి ఆదాయాన్ని అధికపరచడం కాదు అతడి కోరికలను తగ్గించు." —సెనెకా

వేద వేదాంగ పారంగతుడు, సంస్కృత పండితుడు. తంజావూరు సంస్థానంలో రామాయణ ప్రసంగాలు చేస్తూ శ్రీరామనవమి ఉత్సవాలు జరిపించే రామబ్రహ్మము. తల్లి శాంతమ్మ. ఈ పుణ్యదంపతులకు పంచాప కేశబ్రహ్మం అనే జపేశయ్య. మొదటి కుమారుడు. రామనాథ బ్రహ్మం రెండవ కుమారుడు. సత్సంప్రదాయంలో పుట్టినా భగవద్భక్తిగానీ, తలిదండ్రులయందు భక్తిగానీ లేక వీరిద్దరు దుష్టుల అనిపించుకున్నారు. తలిదండ్రులకు తీరని సంతాపం కలిగింది. ఈ సమయంలో తిరువారూరులో వెలసిన శ్రీ త్యాగరాజస్వామి ఈ దంపతులు ఇద్దరికి ఒకనాటి రాత్రి స్వప్నంలో కనపడి వంశ పావనుడు, భక్తాగ్రేసరుడు, మహా వాగ్గేయ కారుడు అయిన కుమారుడు జన్మిస్తాడని, అతనికి తనపేరు పెట్టమని చెప్పి అంతర్ధాన మయ్యాడు. తరువాత పుట్టిన మూడవ కుమారునకు త్యాగరాజస్వామి అని పేరు పెట్టారు. చిన్ననాటి నుండి త్యాగరాజు భక్తి పరుడు, దయాపరుడు, వినయసంపన్నుడు. తలిదండ్రులకు మిక్కిలి ఆనందాన్ని చేకూర్చాడు. వీరి ఇలవేలుపు శ్రీరాముడు. బాల్యంలోనే త్యాగరాజు రామభక్తుడు అయి నాడు. తల్లి త్యాగరాజుకి జయదేవుని అష్ట పదులను, పురందరదాసు దేవరనామాలను, రామదాసు కీర్తనలను, అన్నమాచార్యుల సంకీర్తనలను నేర్పి పాడించేది. తండ్రిగారి వద్ద సంస్కృత, ఆంధ్ర భాషలలో పాండి త్యం సంపాదించాడు. పోతన భాగవతం శ్రద్ధగా పారాయణంచేస్తూ ఉండేవాడు. ప్రతి

## గుండె 32,50,000 లీటర్ల రక్తాన్ని పంపు చేస్తుంది!



మానవ శరీరంలో గుండె ఆగిపోయేంత వరకూ విరామం లేకుండా పనిచేస్తూనే ఉంటుంది. నిమిషానికి 70 సార్లు, రోజుకు 1,00,800 సార్లు, 70 సంవత్సరాల వయస్సు దాకా 2,57,54,40,000 సార్లు గుండె కొట్టు కుంటుంది ఒక సంవత్సర కాలంలో 32,50,000 లీటర్ల రక్తాన్ని పంపుచేస్తుంది. ఈ రక్తంతో 45,000 లీటర్ల పరిణామం ఉండే 72 టాంకులను నింపవచ్చు. శరీరంలో 18,000 కి.మీ. రక్తనాడులలో ప్రవహిస్తూ 12 గంటల కాలంలో 65 టన్నుల భారాన్ని 30 సెం.మీటర్లు పైకి ఎత్తగలిగే టంతటి శక్తిని ఉద్భవింపజేస్తుంది. మానవుని గుప్పిడి పరమాణంలో ఉండే గుండె దాదాపు 450 గ్రాముల బరువు ఉంటుంది. స్త్రీల హృదయం పురుషులకంటె కొంచెం చిన్నదిగా ఉంటుంది.

"ఇరవైయవ శతాబ్దపు మానవుని సహజపాత్ర ఆరాటం, ఆందోళన." —నార్మన్ మెయిలర్

రోజూ స్వంతంగా దివ్యనామ కీర్తనలను రచించి పాడేవారు. ఒకనాడు తోడిరాగంలో "నమో నమో రాఘవాయ" అనే సంకీర్తన రచించి అనేక పండితులను, విద్వాంసులను ఆశ్చర్యచకితులను చేసారు. త్యాగరాజు



సంగీతాభిలాషను గ్రహించి తండ్రి తంజా వూరి ఆస్థాన విద్వాంసుడైన శొంఠి వేంకట రమణయ్యగారి వద్ద శిష్యునిగా ప్రవేశ పెట్టారు. త్యాగరాజు అచిరకాలంలోనే ఏక సంతగ్రాహియై సంగీతంలో గొప్ప పాండి త్యాన్ని సంపాదించారు. త్యాగరాజు మాతా మహుడు వీణా కాళహస్తయ్య గొప్ప సంగీత విద్వాంసుడు. వీరివద్ద అనేక సంగీత శాస్త్ర గ్రంథాలు ఉండేవి. వీటిని సంపూర్ణంగా చదివినా త్యాగరాజుకు సంగీతంలో సందేహాలు కొన్ని నివృత్తికాలేదు. ఇంతలో రామకృష్ణా నందస్వామి అనే సన్యాసి వచ్చి రామషడక్షరీ మంత్రాన్ని, నారదోపాస్తి మంత్రాన్ని త్యాగ రాజుకి ఉపదేశించారు.

నారదోపాస్తి మంత్రం పునశ్చరణ చేస్తూండగానే సాక్షాత్తు నారదుడు ఒక యతి వేషంలో త్యాగరాజుకు దర్శనమిచ్చి 'స్వరార్ణవము', 'నారదీయము' అనే సంగీత లక్షణ గ్రంథాలను ఇచ్చి సంగీతంలో సందేహనివృత్తి చేసుకోమని చెప్పి మాయ మయాడు. అప్పుడు త్యాగరాజు దర్శన మిచ్చిన నారదునిమీద 'రాజిల్లు వీణగల్గు గురురాయ,' 'వర నారద నారాయణ' మొదలైన కీర్తనలను భావగంభీరంగా రచించారు.

త్యాగరాజు రామకృష్ణానందస్వామి ఉపదే శాన్ని అనుసరించి తిరువయ్యారులో పంచ నదీశ్వర దేవాలయంలో 'రామ' మంత్రాన్ని 96 కోట్లు నిష్ఠగా జపించారు. తత్ఫలితంగా రామలక్ష్మణులు ప్రత్యక్షమై దర్శనమిచ్చి అంతర్థానమయ్యారు. ఆ క్షణంలో పొందిన దివ్యానందంతో 'ఏల నీ దయరాదు పరాకు జేసేవేల సమయము గాదు........' అను కీర్తనను రచించారు.

త్యాగరాజుకు 40 సంవత్సరాలు నిండాయి. గొప్ప వైణికుడుగా, గాయకుడుగా, పరమ భక్తాగ్రేసరుడుగా, వాగ్గేయకారకుడుగా ఆయన

---

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద సిమెంట్ ఫ్యాక్టరీ

దక్షిణ కొరియాలో స్సాంగ్ యాంగ్ కార్పొరేషన్‌కు ప్రపంచంలో మిక్కిలి పెద్ద సిమెంట్ ఫ్యాక్టరీ ఉంది. పాలీనా ఈ ఫ్యాక్టరీ సిమెంటు ఉత్పాదకశక్తి 116 లక్షల టన్నులు.

---

"నీ అనుమతి లేకుండా నీవు హీనుడవనే అభిప్రాయాన్ని నీకు ఎవరూ కలిగించలేరు." —ఇలియనార్ రూజ్‌వెల్ట్

కీర్తి నలుదిశలా వ్యాపించింది. త్యాగరాజ కీర్తనల ప్రవాహం, వాటి గొప్పతనం దేశమంతటా పాకిపోయింది. అనేకమంది భక్తులను సంగీత విద్వాంసులుగా చేసాడు. అనేకులు శిష్యులుగా వచ్చి చేరారు. వీరిలో ముఖ్యులు కేరళదేశం తిరువనంతపురంలో యాదవకులమందు జన్మించిన షట్కాల గోవిందదాసు. ఈతడు జ్ఞానభక్తి వైరాగ్యములందు మంచి పట్టుదల కలవాడు. సంగీత సాహిత్య పారంగతుడు, పరమభాగవత శిఖామణి. శ్రీరాముని చేతనే ప్రేరితుడై త్యాగరాజును దర్శించుటకు తిరువయ్యారుకు వచ్చాడు. గంగాతీర మందున్న 'రామదాస్' అనే మరో భక్తుడు తిరువయ్యారుకు వచ్చి త్యాగరాజ దర్శనం చేసుకున్నాడు. అప్పుడు అమితానందంతో త్యాగరాజ 'ఎందరో మహానుభావులు' అనే కీర్తనచే రామభక్తులను కొనియాడి శ్రీరామభద్రుని ధ్యానించి 'దాశరథీ! నీ ఋణము దీర్ప నా తరమా' అను కీర్తనను పాడాడు.

త్యాగరాజుకి 18 వ ఏట పార్వతమ్మ అను ఆమెను ఇచ్చి వివాహం చేసారు. ఐదేళ్ళకే పార్వతమ్మ మరణించింది. అప్పుడు ఆమె చెల్లెలైన కమలాంబను ఇచ్చి త్యాగరాజుకి ద్వితీయ వివాహం చేసారు. కమలాంబకు సీతాలక్ష్మి అనే కుమార్తె కలిగింది. తండ్రి గతించిన కొద్దిరోజులకే త్యాగరాజ పిత్రార్జితమైన ఆస్తిపాస్తులను అన్నగారికిచ్చేసి జీవనోపాధికి ఇతరుల సేవచేయుటకు ఇష్టపడక నిత్యరామ సంకీర్తనంతో ఉంఛవృత్తిని అవలంబించి ఆనందంగా కాలాన్ని గడుపుతుంటున్నాడు. శిష్యులతో మృదంగాది వాద్యములతో కీర్తనలు పాడుకుంటూ వీధులలో పోతూఉన్నప్పుడు

(మిగతా 49 వ పేజీలో)

## దేవుణ్ణి తెలుసుకోడానికి నీ స్వంత శక్తితో ఒకే మార్గాన్ని అవలంబించు



నీ శక్తితో ఒకే మార్గాన్ని అవలంబించాలి. ఇంటి కప్పుమీదికి అనేక విధాలుగా ఎక్కవచ్చు. రాతిమెట్లు నిర్మించుకుని ఎక్కవచ్చు. త్రాటినిచ్చెనతోగాని. ఒక రే ఆధారంతో గాని ఎక్కవచ్చు. లేదా వెదురుబొంగు సహాయంతో ఎక్కవచ్చు. రాతిమెట్లు ఎక్కుతూ నిచ్చెన, నిచ్చెన ఎక్కుతూ తాడు పట్టుకుంటే ఇంటి కప్పుమీదికి చేరలేరు. పట్టుదలతో ఒకే మార్గాన్ని అవలంబించాలి. అదేవిధంగా దేవుణ్ణి తెలుసుకోవాలంటే గాయకత్తులా ఒకే మార్గాన్ని అనుసరించాలి.

—శ్రీరామకృష్ణ

"జీవితంలో సౌందర్యం ఏకించినా కళలో మాత్రం పండదు." —లియొనార్డో డా విన్సీ

# ఉద్రేకం ట్టుకోవాలంటే?

డా. క్లైవ్. డి. హార్లీ

పిరికివాళ్ళు జీవితంలో జరిగే ప్రతి సంఘటనకూ అనవసరంగా అసలు జరిగినా,



జరగకపోయినా భయపడి కంగారు పడిపోతారు. అటువంటివారి భవిష్యత్తు అంతా సంశయాల పుట్ట. ఎటువంటి ఆశలూ, ఆశయాలూ లేకుండా నిరాశతో జీవితాన్ని గడుపుతారు. ప్రపంచంలో ఏ క్షణం ఏం జరుగుతుందో, ఎలా పరిణమిస్తుందో ఎవ్వరికీ ముందు తెలియదు అలాంటప్పుడు ప పనులో ఆందోళన, బెంగ, చికాకు పడిపోవడంవల్ల ఏం లాభం? అనవసరంగా మథనపడిపోవడంవల్ల ఏం సాధించలేం. మానసిక ధైర్యంతో, స్థైర్యంతో సాహసంగా జీవించాలి.

కంగారుపడిపోతూ, తబ్బిబ్బుపడుతూ ఒక పనిని చేస్తూ అది పూర్తికాకుండానే మరో పని ప్రారంభించకూడదు. క్రమబద్ధంగా ఒక పనిని పూర్తిచేసుకుని మరో పనికి పూనుకోవడం ఉత్తమం. చేసిన పనినే తిరిగి చేయకుండా, ఏ రోజు పనులు ఆ రోజు ప్రతిరోజు మరచిపోకుండా సక్రమంగా నెరవేర్చుకోడానికి దినచర్య ప్రణాళికలను ఏర్పాటు చేసుకోవాలి. చేయవలసిన పనిని యథావిధిగా నిర్వహించి తీరాలి. మీరు చేసే పని మీకు విసుగు కలిగించ

## ప్రపంచంలో మిక్కిలి చిన్న పసిపాపకు హృదయం మార్పిడి

లండన్‌లోని నేషనల్ హార్ట్ హాస్పిటల్ వైద్యులు కెంట్‌కు చెందిన హోల్లీ రాఫే అనే 10 రోజుల పసిపాపకు 5 గంటల సేపు శస్త్ర చికిత్సచేసి హృదయాన్ని మార్చారు. ఇది ప్రపంచంలోనే మిక్కిలి చిన్నవయస్సులో చేసిన మొదటి హృదయం మార్పిడి. నెదర్‌లాండ్స్ (హాలండ్)లో మరణించిన 3 రోజుల పసిపాప హృదయం దానం చేయబడింది.

"దైవం ముందు మానవులు ఎంత వివేకులో
అంతటి అవివేకులు కూడా."

-ఆల్బర్ట్ ఐన్‌స్టైన్

వచ్చు, కష్టమనిపించవచ్చు. దానికోసం అనవ సరంగా మనస్సులో మదనపడి పోనక్కర లేదు ఆందోళన పడిపోతే చేసేపని మరింత కష్టమనిపిస్తుందేగాని ఏ విధమైన లాభం పొందలేం. అసలు చేయవలసిన పనిని చేయ కుండా దాన్ని గురించే పరి పరి విధాల ఆలో చిసూ అలసిపోకూడదు.



సావకాశంగా పనిని సాగించుకోవాలి. ఏ పనైనా త్వరగా ముగించేసుకుందామని తొందరపడి పోకూడదు చేసిన పనిని అతిగా చేయడానికి ప్రయత్నించవద్దు ఆ రోజు చేయవలసిన పని పూర్తి చేసుకోలేకపోతే భయపడిపోనవసరం లేదు. సాధ్యమైనంత వరకు, చేయగలిగినంతవరకు చేసి సంతుష్టిని పొందాలి. అసాధ్యమైన దానిని సాధించడానికి పూనుకోకూడదు. ఒకరిగుణాన్ని మార్చడానికి వ్యర్థంగా ప్రయత్నాలు చేయవద్దు. వారిలో మార్పు రావాలంటే ఆ మార్పుకు ప్రయ త్నాలు వారిలోనూ కొనసాగాలి.

మోసపోకూడదు. ముఖ్యంగా అతి దగ్గర వాళ్ళు ఏదో చేస్తారు అనుకోవద్దు. వాళ్ళమీద ఆధారపడవద్దు మీ వైవాహిక జీవితంలో భాగస్వామి మానసిక శాస్త్రరీత్యా 10 సం. రాలు చిన్నగా ఉంటే వారి భావాలను సహృద యంతో అర్థం చేసుకోవాలి. కోపం, ఉద్రేకం, మనస్సులో ఆందోళన పెచ్చు పెరిగిపోతే మాట్లాడకుండా మౌనంగా ఒక పూట పూర్తిగా విశ్రాంతి తీసుకోండి. మనందరికీ ఏవో కష్టాలు, అనారోగ్యం సాధారణంగా ఉండనే ఉంటాయి. విశ్రాంతిగా హాయిగా ఉండాలంటే వీటిని అసలు లెక్కచేయకూడదు. ఏది ముఖ్యమైనది, ఏది ముఖ్యమైనది కాదు అనేది వివేకంతో తెలుసుకోవాలి. ప్రతి విషయం ఉల్లాసంగా తీసుకోవాలి.

ఏ గురించి నీవు న్యాయంగా ఆలోచించు కోవాలి. వాసవంగా నీవు పెద్దవాడవు

## ఈ జనం అంతా గ్రేస్ బాటింగ్ చూడడానికే వచ్చారు

ఆంగ్లేయ క్రికెట్ ఆటగాడు డా. డబ్ల్యు. జి. గ్రేస్ ఆస్ట్రేలియాలో క్రికెట్ ఆడుతూ ఉండగా ఒకస్కోరు కూడా చేయకపోయినా ఔట్ అని డిక్లేరు చేసారు. వెంటనే కోపం వచ్చి బంతి పాడ్స్‌కైనా తగల్లేదని అంపైర్ దగరకు పరుగెత్తుకువెళ్ళి ప్రేక్షకులను చూపిస్తూ "చూడండి! ఈ జనమంతా డబ్ల్యు. జి. గ్రేస్ ఎలా బాట్ చేస్తాడో చూద్దామని వచ్చారు. అంపైర్‌గా నీ పెత్తనాన్ని చూడ డానికి కాదు" అన్నాడు. ఇది విని బౌలర్ పకపకా నవ్వాడు.

"కష్టాలలో అందరూ దేవుణ్ణి స్మరిస్తారు. సుఖాలలో ఎవ్వరూ స్మరించరు. సుఖాలలో స్మరించే వారు దుఃఖరహితులు." —కబీరు

అయినావా? నీ బుద్ధి వికసించిందా? మనం ఎలా ఉండాలి? ప్రస్తుతం మనం ఇప్పుడు ఎలా ఉంటున్నాం? అనేవి రెండూ రెండు ప్రత్యేక విషయాలు. మనం ఆశించేవి, మనకు



లభించేది ఎప్పుడూ ఒకటే కావు. ఆశించేది ఒకటి, లభించేది మరొకటి. మానసిక ఉద్రేకం లేకుండా శాంతంగా ఉండాలంటే మనస్సులో రాజీ కుదరాలి. విశ్రాంతి తీసుకోడం అభ్యాసం చేసుకోవాలి. భోజనంచేసిన తరువాత 10 నిమిషాలపాటు మనస్సులో ఏ చీకూ, చింతా పెట్టుకోకుండా ఉండాలి.

మనస్సుకి, శరీర అవయవాలకు విశ్రాంతి విస్తే దానంతట అదే ఉద్రేకం తగ్గిపోతుంది. విశ్రాంతి తీసుకోడం అంటే మానసికంగా మనకు కలిగించే అన్నిరకాల ఒత్తిడులను నివారించుకోవాలి. మీ పనికీ, వ్యాపారానికీ సంబంధించిన యోచనలు, మీ స్వంత సమస్యలు రవంతసేపు కట్టిపెట్టాలి. మనస్సుకు శాంతిని కలిగించే సుందర తర దృశ్యాలను పరికించి చూడండి. ఆకుపచ్చని చెట్లని చూడండి. అమర్చిన పూలగుత్తిని పరిశీలించండి. నిర్మలమైన ఆకాశాన్ని తిలకించండి. ఇతర విషయాలను మరచిపోయి ఈ సుందర దృశ్యాలను మనస్సులో విస్తరించుకు పోనివ్వండి. మనసులో ఇతర ఆందోళనలను దరిచేరనీయకూడదు.

మనం తీసుకునే విశ్రాంతి మరింత విశ్రాంతికి అవకాశం కల్పించాలి. అలాంటప్పుడు మనస్సులో ఆందోళనను మరచిపోతాం. ఇతరులు ఎవరో చేయమన్నారని కాదు—నీవు చేయవలసిన పనిని నీవు పూర్తి చేయి. ఆశలకు ఆశయాలకు అవధులు ఉన్నాయి. అత్యాశ ఉండకూడదు. ఇరుగు పొరుగు వారితో స్నేహపూర్వకంగా ఉండడానికి ప్రయత్నంచేస్తే నరాల ఉద్రేకం తగ్గిపోతుంది. మనస్సులో ప్రశాంతత ఏర్పడుతుంది. ●

---

## అభివృద్ధి పొందుతూన్న దేశాలలో కాన్సర్ వ్యాధి పీడితుల ఆ

ఈనాడు అభివృద్ధి పొందుతూన్న (మూడవ ప్రపంచం) దేశాలలో కాన్సర్ వ్యాధికి గురి అయిన రోగులు 30 లక్షల మంది ఉన్నారు. పారిశ్రామికాభివృద్ధిని పొందిన దేశాలలో వీరి సంఖ్య 28 లక్షలు. భారతదేశంతో సహా అభివృద్ధి పొందుతూన్న దేశాలలో పొగత్రాగుడు ఎక్కువగా ఉంది.

—(ఆధారం-వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్ రిపోర్ట్)

"ఊరేగింపులు తిరిగివచ్చినట్లు నిందలు
బయలుదేరిన చోటికే వచ్చి చేరతాయి." -ఇటలీ సామెత

# పసి లుకు

జగత్ ఎస్. బ్రైట్

## 4

**మనసుల కలయిక:**

ఒకరు ఒకవ్యక్తిని కలవడానికి ఉత్తమ మార్గం మానసికంగా కలవడమే ప్రయాణానికి ఉత్తమ మార్గం ఆత్మాతీతమైన మార్గం.

* * *

**మంచి స్నేహానికి మంచి మార్గం:**

అనవసరమైన కలుపును తీసేస్తేగాని మంచి స్నేహానికి మార్గం నిష్కంటకంగా ఉండదు. నీళ్ళతో నిండిన కుండను పాలతో ఎలా నింపగలం?

*

**కష్టాలను అధిగమించాలి:**

కష్టం అనేది ఒకటే కాదు. వెయ్యి రకాల కష్టాలు. అన్ని కష్టాలను అధిగమించాలి.

* * *

**మంచి పెద్దల సాన్నిధ్యం:**

ఒక మంచి కార్యాన్ని నెరవేర్చడానికి చెడును వినియోగించుకోవచ్చు పెద్దవారిని కూడా లోకంలో బాధితులందరికీ సేవ చేయడానికి సమకూర్చవచ్చు.

మంచిని అనుసరించబోయి చెడుకు లొంగిపోకూడదు. మంచి పెద్దలు అతి సన్నిహితమైనవి. ఒకే నాణానికి బొమ్మ బొరుసు వంటివి మంచి పెద్దలు. మంచి చెడును ఆక్రమించనంత వరకూ చెడు మంచిని ఆక్రమించలేదు.

* * *

**అప్సరస-రాక్షసి:**

ప్రతీ దానికి అమరత్వం రాక్షసత్వం రెండు ఉన్నాయి. రాక్షసత్వాన్ని పూర్తిగా వదలి అమరత్వాన్ని ఏకాగ్రతతో ధ్యానించు. సుందరమని ఏది తోస్తుందో అదే సత్యం.

'హృదయంలో అంకురించే ప్రేమ
సత్యమైన భావన. మనసులో
ఏది సుందరమనే భావన కలుగుతుందో
అదే సత్యం.' —జాన్ కీట్స్

(సశేషం)

## వెబ్‌స్టర్ డిక్షనరీ పూర్తి చేయడానికి 18 సం.లు పట్టింది

ఆంగ్లభాషలో సుప్రసిద్ధమైన వెబ్‌స్టర్ అమెరికన్ డిక్షనరీ పూర్తి చేయడానికి నోవా వెబ్‌స్టర్ (Noah Webster) కు 18 సం.లు (1807-1825) పట్టింది. 1828 సం. లో ప్రచురింపబడిన ఇతడి తొలి డిక్షనరీలో అనాటి వరకూ ప్రచురింపబడని 12,000 మాటలు, 30.000 నిర్వచనాలతో రెండు సంపుటాలుగా విడుదల చేశారు.

"గుణాలకంటె లోపాలను బట్టే
మన స్నేహితుల నైజం తెలుసుకోగలం."— డబ్లు. సామర్ సెట్ మామ్

# సద్భావాలు పెంచుకోండి

హెచ్. కె. లక్ష్మణరావు

ఒక విషయాన్ని బట్టిచూస్తే మనం అంతా ప్రకటించిన సరకును నగదు చేసుకునే సేల్స్‌మెన్‌లాటి వాళ్ళం. తెలిసో తెలియకో



నిరంతరం మనోభావాలను ప్రకటించుకుని నగదు చేసుకుంటాం (ఇతరులు ఒప్పుతున్నా, ఒప్పుకోకపోయినా). మనలో రేకెత్తే భావాలను పరాయివాళ్ళకి ప్రకటించి విక్రయించడంలో మన మెంతో ఉదారులం. అసలు మన మనోభావాలు మనకు ఎంతవరకు ఉపయోగపడుతున్నాయో ఆలోచించం.

మనం వినియోగించుకునే ఈ మనోభావాలు, యోచనలు వ్యక్తిగతంగా గానీ, ఉద్యోగరీత్యాగానీ ప్రతీ జీవితంలో జయాపజయాలకు ఎంతో ముఖ్యపాత్రను వహిస్తున్నాయి.

ఈ పని చాలా కష్టం అనే భావం ప్రకటించుకుంటే అది కష్టంగానే ఉంటుంది. ఇది నేను చేయలేను అని భావిస్తే నిజంగానే ఆ పని చేయలేకపోతాం. ఈ విధంగా ఎన్నెన్నో రకరకాల భావాలను ప్రకటించుకుంటాం. ఈ పనిచేయడం నాకు ఇష్టంలేదు, నేను అనుకునేది మంచిది కాదనుకుంటా అనే భావాలు ప్రకటించుకుంటే ముందు అడుగు వేయలేం. అసలు అనుకున్న లక్ష్యాలను సాధించలేం. ఇరుగు పొరుగువారి కంటే, స్నేహితులకంటే మనం తక్కువ వాళ్ళమనుకుని వారికంటే నీచంగా, హీనంగా చూచుకుంటాం. దిగులు, భయం, సంశయం మొదలైన ఋణభావాలను ప్రకటించి ప్రవర్తింప చేసుకుంటాం. ముందుకు సాగలేకపోతున్నాం అని ఆశ్చర్యపడిపోతాం. మన నడవడి, మన ప్రయత్నాలు, మన సాధనలు,

---

## నేను ఒకేసారి మరణిస్తా

రోమన్ నిరంకుశ చక్రవర్తి జ్యూలియస్ సీజరుని అతడి స్నేహితులు నిరాయుధుడై జనంలో నడవవద్దని చెప్పారు. దానికి అతడు 'మరణానికి భయపడి జీవించేవాడు ప్రతి నిముషం దాని బాధను అనుభవిస్తాడు. నేను మరణించేది ఒకేసారి' అన్నాడు.

"ప్రతీ మానవుడు తన జీవితాన్ని తెలుసుకోవాలి." —జీన్ పాల్ సార్త్రే

ఉద్యమాలు ఈ 'ఆలోచన' అనే బీజంలో మంచి ఉద్భవించినవే. విశ్వాసం, శక్తి సామర్థ్యాలతో కూడిన నమ్మిక, ఉద్యమం, పట్టుదల మొదలైనవి దిగ్విజయానికి ఆవశ్యకాలైన ధనభావాలు.

మనం ఏ విధంగా ఋణభావాలు ప్రకటించుకుని అపజయాన్ని పొందుతున్నామో, అలాగే మంచి ధైర్యంతో, ధీమాతో ధన భావాలను ప్రకటించుకుని దిగ్విజయాన్ని సాధించగలం. రెండూ మనోభావాలే. భావాల తీరుని మార్చుకోవాలి. మీలో అసమర్థ భావాన్ని పెంపొందించుకోడం కంటే ధనాత్మకమైన ధైర్యోత్సాహాలను వృద్ధిచేసుకోండి. దీనివల్ల మీలో నిద్రాణమై ఉన్నశక్తి చైతన్యవంతంగా ప్రవర్తిస్తుంది.

సుప్రసిద్ధ విజ్ఞానవేత్తలు కూడా ఎవరంతట వారు ఉత్సాహం పొందడానికి తమ స్వంత సలహాలనే అనుసరిస్తారు. మీ అంతట మీరు మీలో ఈ సద్భావాలను ప్రకటించి నగదు చేసుకోవచ్చు. ఇక్కడ పునరుక్తి అంటే చెప్పిన దానినే తిరిగి మళ్ళీ మళ్ళీ చెప్పడం ముఖ్యంగా గమనించాలి. ప్రతిరోజూ మననం చేసుకోవాలి. నా కలలు నేను నిజం చేసుకోగలను, నేను విజయాన్ని సాధిస్తాను అనే భావాలను ప్రసరింపచేయండి. పరిపూర్ణ ఆత్మ విశ్వాసం, నమ్మిక ఇంద్రజాలంలా పని చేస్తుంది. మంచి విజయ సాధకానికి అనువైన భావాలను ప్రవృద్ధి చేసుకోడానికి ఉద్వేగం కూడా ఉండాలి. ఋణభావాలను పెంపొందించుకోడంలో మీరు అనాలోచితంగానే లోపభూయిష్టమైన భావాలను ప్రకటించుకుంటున్నారు. మీరు పరాయి వాళ్ళ కంటే హీనులమనుకునే దైన్యభావాన్నీ, నైచ్యభావాన్నీ, అనుమానాన్ని ఉద్వేగపరచుకుంటున్నారు. మనోవిభ్రమం, ధైర్యం, సాహసంతో నిండిన ఉద్వేగాలను, ఔత్సాహిక భావాలను పెంచుకోండి. మీ అంతరాత్మకు గట్టిగా నచ్చచెప్పుకోండి. ఎలా పని చేస్తుందో చూడండి!

## బుల్లెట్ ట్రెయిన్ రికార్డు వేగం



బ్రిటన్‌లో గంటకు 257 కి. మీ వేగంతో పోయే అడ్వాన్స్ ప్యాసింజరు ట్రెయిన్ (APT) లండను గ్లాస్కోల మధ్యగల 645 కి. మీ దూరాన్ని 4 గంటల లోపలే చేరింది. బుల్లెట్ ఆకారంలో గల ఈ ట్రెయిను ఎక్కడా ఆగకుండా సరాసరి గంటకు 165 కి. మీ వేగంతో 3 గం 52 3/4 ని.లో వెళ్ళింది. రైలు మార్గంలో వంపులు తిరిగేటప్పుడు వేగం తగ్గిపోకుండా దీనికి ప్రత్యేకమైన క్రొత్త ఆటోమేటిక్ టిల్టింగ్ విధానం అమర్చబడింది.

"మానవుని కంటే పరిస్థితులు మిక్కిలి బలమైనవి." —జవహర్ లాల్ నెహ్రూ

# జాతీయ వార్తలు

## డిగ్రీ కోర్సులకు భారతదేశపు ప్రప్రథమ దూర విద్యాకేంద్రం:

భారతదేశపు మొట్టమొదటి దూర విద్యా కేంద్రం పూనే విశ్వవిద్యాలయం వారు స్థాపించారు. వివిధ ప్రదేశాలలో కేంద్రాలు ఏర్పరచి సామూహిక విమర్శలకు అనువుగా ప్రసిద్ధి గాంచిన ప్రొఫెసర్ల సహాయంతో ముందుగా రికార్డు చేయబడ్డ క్యాసెట్లు, పాఠ్య గ్రంథాలు లభింప జేస్తారు.

* * *

## గురుగ్రహం ఐనాస్ఫియర్‌లో విద్యుత్ క్షేత్రాలు:

న్యూఢిల్లీ నేషనల్ ఫిజికల్ లాబొరేటరీలో వైజ్ఞానికా శాస్త్రజ్ఞులు గురుగ్రహానికి ఐనాస్ఫియర్ (Ionosphere) లో విద్యుత్తు క్షేత్రాలు ఉన్నాయని, ఇవి భూమి విద్యుత్తు క్షేత్రాల కంటే బలిష్టమైనవని తెలియజేస్తున్నారు. సూర్యుని తాపంవల్ల వాయువులు ఋణ విద్యుదావేశంగల ఎలక్ట్రానులు (negatively charged electrons) గాను, ధన విద్యుదావేశంగల ఐయాను (positively chargedions) లుగాను వియోగం చెందే పొర ఐనాస్ఫియరు.

## ఆంధ్రప్రదేశ్‌లో రూ. 5 కోట్లతో క్లచ్‌ప్లేట్ల సంస్థ:

ఆంధ్రప్రదేశ్‌లో వెనుకబడిన నల్గొండ జిల్లా గూడూరు గ్రామంలో ఇటలీ సాంకేతిక

## నందిజాతులు వధువును వెదుక్కునే విధానం



తూర్పు ఆఫ్రికాలో నందిజాతికి చెందిన యువకుడు బ్రతికి ఉన్న 50 పక్షులను పట్టుకుని టోపీకి తగిలించిన పెద్ద చట్రానికి బంధించి టోపీని తలమీద పెట్టుకుంటాడు. ఇంతలోనే పక్షులు టోపీతోపాటు ఎగిరిపోతాయి. టోపీ ఏ ఇంటిమీదపడితే ఆ ఇంట్లో పెళ్ళీడులో ఉన్న వధువును పెళ్ళి చేసుకుంటాడు.

"నీతి, నియమం, సంస్కారం కలవారు ఇస్తారు, మన్నిస్తారు. లేనివారు తీసుకుంటారు, మరచిపోతారు." —స్వామీ చిన్మయానంద

సహాయంతో సరికొత్త విధానంలో రూ. 6 కోట్ల వ్యయంతో ఒక జాయింట్ సెక్టారు సంస్థ ఏర్పాటు కాబోతూ ంది. ఇక్కడ ప్రప్రథమంగా భారతదేశంలో సింటర్డ్ మెటాలిక్ క్లచ్ ప్లేట్లు తయారవుతాయి. దీని వల్ల సుమారు రూ. 3 కోట్లు విదేశీమారకం ఆదాకాగలదు.

* * *

## భారతీయ నౌకకు క్రొత్తగా మూడు మైన్ స్వీపర్లు:

భారతీయ నౌకాదళానికి శత్రువుల జలాంతర్గాములను రేవులను దాటి రానీయకుండా క్రొత్తగా మూడు మైన్ స్వీపర్లను చేర్చారు. రష్యా నిర్మితమైన ఈ స్వీపర్లు ఒక్కొక్కటి 100 టన్నుల బరువు ఉంటుంది. పై బరు గ్లాసుతో తయారై జలాంతర దూరదర్శినులు అమర్చబడి వుంటాయి.

* * *

## అరుణాచల ప్రదేశ్‌లో బొగ్గు, సున్నపురాళ్ల నిక్షేపాలు:

అరుణాచల ప్రదేశ్ లోహిత్, టిరాప్ జిల్లాలలో విస్తారమైన బొగ్గు, సున్నపురాయి నిక్షేపాలు కనుగొనబడ్డాయి మొత్తం 750 లక్షల టన్నుల బొగ్గు లభించగలదని అంచనా వేయబడింది. ఇప్పటికే డ్రిల్లింగు వల్ల ఇందులో 200 లక్షల టన్నుల బొగ్గు ఉన్నట్టు తేలింది

## భూగర్భ జలాలు పెల్లుబికి వస్తాయి:

సెంట్రల్ గ్రౌండ్ వాటర్‌బోర్డు వారు మేఘాలయాలో భూగర్భ జల ఊటలను కను గొన్నారు. ఇవి నీటిని పైకెత్తే సాధన సదు పాయాలు లేకుండానే వాటంతట అవే నీళ్ల ఊటలనుండి పెల్లుబికి పైకివస్తాయి.

* * *

## 'జాతీయ బెంగాలీ డిక్షనరీ' 20 సంపుటాలు:

బెంగాల్‌లోని నేషనల్ కౌన్సిల్ అఫ్ ఎడ్యు కేషన్ వారిచే 'జాతీయ అభిదాన్' (జాతీయ డిక్షనరీ) 20 సంపుటాలలో సమకూర్చబడు తుంది. 2,50,000 ఎంట్రీలతో 1,200 పుట లతో ఇది వంగ భాషలో మిక్కిలి పెద్ద నిఘంటువు.

* * *

(మిగతా 41 వ పేజీలో)




"ఒక మహాపర్వతం లాటి వివేకవంతుడు
గాలివాన వంటి నిందాస్తుతులకు చలించడు." —గౌతమబుద్ధుడు

# అతి ఎప్పుడూ పనికిరాదు

స్వామీ లలితానంద

ప్రతీ విషయంలోనూ అతిగా ప్రవర్తించడం మానవనైజం. మంచిగా ఉండటం ప్రారంభిస్తే పుంజుకుంటూన్న వేగంతో ఇంకా అలాగే ఉండటానికి ప్రయత్నిస్తాడు



మానవుడు. హద్దు పద్దు లేకుండా మితిమీరిపోతాడు. వివేకం లేకపోవడంవల్ల, జాగరూకతతో ప్రవర్తించకపోవడంవల్ల ఇదే ఒక అలవాటుగా మారిపోతుంది. ఈ అలవాటే సహజగుణంగా మారుతుంది.

ఒక వ్యక్తి బాగా అలసిపోయి శ్రమతో ఇంటికి చేరుకుంటాడు. పడక కుర్చీలో కూర్చుంటాడు. కాళ్ళు బల్లమీద జాపుకుని విశ్రాంతి తీసుకుంటాడు. ఇలా కూర్చుంటే ఆరోగ్యానికి భంగం కలుగుతుందని గ్రహించడు. కూర్చునే పద్ధతి యొక్క ప్రభావం తీవ్రంగా మనస్సుమీద ఉంటుందని తెలుసుకోలేడు. వంకరగా కూర్చుంటే మనస్సులో బద్ధకం బయలుదేరుతుంది. బద్ధకం ఒక్కసారి అలవాటు అయిపోతే దాన్ని పోగొట్టుకోడం మిక్కిలి కష్టసాధ్యం. అయినప్పటికి ప్రథమావస్థలో నిగ్రహశక్తితో ప్రయత్నించి సరిదిద్దుకోవచ్చు

ఒక అలవాటు ఎంత చిన్నదైనా మనస్సుమీద స్థిరంగా ముద్రింపబడిపోతుంది. తన

---

## ప్రతీదెబ్బ తీర్చి దిద్దుతుంది

ఒక శిల్పి సుత్తిని, ఉలిని పట్టుకుని చలువ రాతిని చెక్కడానికి ప్రయత్నిస్తూ ఆ రాతిని ఎన్నోసార్లు చెక్కుతాడు, రూపుమాపుతాడు. చిట్టచివరికి సుందరమైన శిలా విగ్రహం తయారవుతుంది. అదే విధంగా దైవమిచ్చే కష్టాలు మానవులను తీర్చిదిద్దుతాయి.

—జె. ఎమ్. విల్సన్

---

"జీవితం క్షణికమే కాని జీవితంలో బాధలవల్ల దీర్ఘకాలికం అనిపిస్తుంది." —పబ్లిలియస్ సైరస్

అలవాటుకి లొంగిపోతున్న కొద్దీ మానవుని మనస్సుమీద వీటి ప్రభావం మరింత తీవ్రమైపోతుంది. త్వరలో ఈ అలవాటు భూమిలో వేళ్లు బాగా తన్నిన మఱ్ఱిచెట్టులా ప్రవృద్ధి పొందుతుంది.

మితాన్ని అలవాటు చేసుకోవడంవల్ల అవధులు దాటిపోయే 'అతిని' అదుపులో పెట్టుకుని ప్రతినిత్యం జీవితంలో ఆరోగ్యవంతమైన సారప్యాన్ని అభివృద్ధి చేసుకోవచ్చు. మితత్వం అనేది అందమైన వసంతకాలం వంటిది. చిన్న చిన్న మేఘాలతో ఆకాశం నిర్మలంగా ఉంటుంది. అంత ఎండ ఉండదు. అంత చలి ఉండదు. హాయిగా ఉంటుంది. అదేవిధంగా ప్రతీ విషయంలోను మితత్వాన్ని అవలంబించిన కొద్దీ విశ్రాంతిని అధికంగా అనుభవిస్తూ చేయవలసిన పనులన్నిటినీ సార్థకంగా నెరవేర్చుకోగలుగుతాం.

శ్రీకృష్ణభగవానుడు గీతలో-"ఎక్కువగా భుజించువానికి యోగం కుదరదు. ఏమీ తిననివానికి ఇది లభింపదు. ఎక్కువగా

---

## 'అంగ్‌కోర్‌వాట్' ప్రపంచంలో మిక్కిలి విశాలమైన పవిత్ర ఆలయం



1861 సం. లో ఫ్రెంచిదేశపు ప్రకృతి పరిశోధకుడు హెన్రీమౌహాట్ నేటి కాంపూచియా (ఆగ్నేయ ఆసియా) లో దట్టంగా పెరిగిన అడవుల మధ్య సీతాకోక చిలుకలను వెతుకుతూ పోయినప్పుడు నశించిపోయిన ఖెమెర్ (khmer) సామ్రాజ్యం ముఖ్య పట్టణం అంగ్‌కోర్‌ను అకస్మికంగా కనుగొన్నాడు. 9 వ శతాబ్దం నాటి నుండి 14 వ శతాబ్దం దాకా 40 చదరపు మైళ్ళ సువిశాల ప్రదేశంలో 20 లక్షల మంది జనం అంగ్‌కోర్‌లో నివసిస్తూ ఉండేవారు. 14 వ శతాబ్దంలో ఖెమెర్ నివాసులు పూర్తిగా ఓడింపబడ్డారు. వారి ముఖ్యపట్టణం 'అంగ్‌కోర్' కొల్లగొట్టబడింది. తరువాత 5 శతాబ్దాలపాటు అంగ్‌కోర్ చుట్టూ దట్టంగా అడవులు విస్తారంగా పెరిగిపోయాయి.

ఈ నాటికీ ఈ నగరంలో నిర్మాణానికి ఉపయోగించిన ప్రతీరాయి చెక్కు చెదరకుండా ఉంది. ఇచ్చటి విశాలమైన పవిత్ర ఆలయం 'అంగ్‌కోర్ వాట్'. ఈ పెద్ద సంకీర్ణ నిర్మాణంలో ప్రాకారాలు, మండపాలు, 5 గోపురాలు ఉన్నాయి. వీటిలో మిక్కిలి ఎత్తైన గోపురం ఎత్తు 250 అడుగులు.

---

"రెండు కళ్ళులేని గ్రుడ్డివాళ్ళలో
ఒంటి కంటి వాడు మహారాజు." —థామస్ ఫుల్లర్

నిద్రించేవానికి, అమితంగా మేలుకొని ఉండు వానికి గూడా ధ్యానం కుదరదు. పరిమితమైన ఆహార విహారములు కలిగి, జపతపముల యందు పరిమితమగు ప్రయత్నం కలిగి నియమితమైన నిద్ర, జాగరణ కలిగి ఉండు వానికే ధ్యానం దుఃఖాన్ని పోగొట్టును" అని చెప్పాడు. ధ్యానాభ్యాస నిష్ఠలో దురభి మానము, వీరావేశము పనికిరావు. అత్యంత సుఖాన్ని అనుభవించడానికి ధ్యానం ఆదేశింప బడవచ్చు కాని మితిమీరి ధ్యానం ప్రారం భిస్తే విసుగు పుడుతుంది అప్పుడప్పుడు దీర్ఘ కాలంపాటు ధ్యానం చేయడంకంటే రోజూ ఏ కొద్దిసేపో సక్రమంగా ధ్యానం చేయడం ఉత్తమం నిత్యకార్యక్రమాలను నిర్వహిస్తూ యోగాభ్యాసానికీ, ధ్యానానికీ, పారాయ ణానికీ, మంత్రజపానికీ తగిన సరళ ప్రణా ళికను ఏర్పరచుకోవాలి. దీనివల్ల ఉత్కృష్ట మైన మానసిక శాంతిని పొందవచ్చు.

జ్ఞానోదయానికి ముందు బుద్ధుడు అమి తంగా తపోనిష్ఠను ప్రారంభించాడు. అప్పుడు ముగ్గురు జానపద నృత్యకారులు అతని ముందు నిలిచి ఇలా మాట్లాడుకున్నారు. "అధిక శృతిలో వీణ తీగలు తెగిపోతాయి. తక్కువ శృతిలో ధ్వని పుట్టదు. సమస్థాయిలో శృతిని బిగించినప్పుడు సుశ్రావ్యమైన సంగీతం జనిస్తుంది." ఇది విన్న బుద్ధుడు జ్ఞానోదయానికి "అతి సర్వత్ర వర్జయేత్" అని వెంటనే గ్రహించాడు. ఆధ్యాత్మిక సాధనలో మిత మనే పేరుతో నిత్యకర్మలను ఆచరించటం మానవద్దు. నిరం తరం మితాచరణ బుద్ధితో మనస్సును సమా ధాన మొనర్చుకుని శాంతిని పొందడానికి ప్రయత్నించాలి. ●

## ప్రపంచంలో మిక్కిలి ఎత్తైన జలపాతం



దక్షిణ అమెరికా వెనిజూలా అడవులలో పీఠభూమి (Plateau) సుమారు 9,000 అడుగుల ఎత్తున ఉంటుంది. ఈ పీఠభూముల నుండి ప్రవహించే కరోడీ నది ఒక చోట ఎత్తయిన కొండమీద నుంచి క్రిందికి పడు తుంది. ఇదే ప్రపంచంలో ఎత్తైన జలపాతం.

అమెరికా పైలెటు జిమ్మీ ఏంజిల్ దీనిని 1937 సం. లో కనుగొన్నాడు. ఈనాడు దీనికి ఇతడి పేరే పెట్టారు. ఏంజిల్ జలపాతం అమెరికాలో నయాగరా జలపా తానికి 20 రెట్లు ఎత్తులో ఉంది. ప్రపంచంలో ఇతర జలపాతాలకంటె వెయ్యి అడుగుల ఎత్తులో ఉంది. దీని ఎత్తు 3.300 అడుగులు అని కొంతమంది చెప్పినా చూచినవారు దీని ఎత్తు ఒక మైలు అని చెబుతారు.

"నీటిలో మునిగిపోతూన్న వాడికి వర్ష భయం ఉండదు." —పర్షియన్ సామెత

# వీరిని గురించి తెలుసుకోండి

అల్బర్ట్ కామస్: గొప్ప ఫ్రెంచి రచయిత. జర్నలిజంకు, నాటకాలకు తన జీవితాన్ని అంకితం చేసి 1957 సం. లో నోబెల్ బహుమానాన్ని పొందారు. 'ది మిత్ ఆఫ్



సిసిఫస్' (The Myth of Sisyphus) ఈతడి సుప్రసిద్ధ నవల. ఈయన రచించిన నవలలు, నాటకాలు వివేక వర్గాలలో విప్లవాన్ని లేవదీసాయి. ఇతడు 47 వ ఏట కారు ప్రమాదంలో మరణించాడు.

• • •

ప్రితిపాల్ సింగ్: అనేక హాకీ పందేలలో పేరుగడించిన నాయకుడు. ఇతడు 'పెనాల్టీ కార్నర్ ఎక్స్పర్ట్' అని ప్రసిద్ధి పొందాడు. 1964 సం. లో టోకియో (జపాన్) లో జరిగిన ఒలింపిక్ ఆటలలో షార్ట్ కార్నర్ హిట్టులతో 11 గోలు సాధించి, భారతదేశానికి ఒలింపిక్ టైటిల్ సంపాదించిన ఆటగాడు. వ్యవసాయ శాస్త్రంలో ఎమ్.ఎ. డిగ్రీని పొందిన ఇతడు లూధియానా అగ్రికల్చరల్ యూనివర్సిటీ కాంపస్‌లో మే 1983 లో కాల్చి చంపబడ్డాడు.

• • •

లియాక్సినియన్: చైనా అధ్యక్షుడు. మంగోలియా శ్రీమంతుల జాతికి చెందిన ఇతడు చైనాలో చదువుకున్నాడు. ఆర్థిక ప్రణాళికా కర్తగా నైపుణ్యాన్ని పొందాడు.

• • •

డేల్ కార్నీజ్ (1888-1955): అతి సరళంగా గ్రంథాలను రచించే అమెరికన్. 'హౌ టు విన్ ఫ్రెండ్స్ అండ్ ఇన్‌ఫ్లుయెన్స్ పీపుల్' (how to win friends and influence people), హౌ టు స్టాప్ వరీయింగ్ అండ్ స్టార్ట్ లివింగ్' (how to stop worrying and start living) అనే గ్రంథాలు వీరు రచించినవే.

• • •

కల్కి కృష్ణమూర్తి తమిళులకు రాజకీయంగా, సాంఘికంగా మిక్కిలి చైతన్యం కలిగించిన బహుముఖ ప్రజ్ఞావంతుడు. కల్కి అనే కలం పేరుతో ఒక పత్రికకు సంపాదకత్వాన్ని వహించి తమిళ సాహిత్య రంగంలో

(మిగతా 30 వ పేజీలో)

"స్వీయానుభవం ద్వారా మాత్రమే తెలుసుకుంటామనే వారు మూర్ఖులు." —బెంజమిన్ ఫ్రాంక్లిన్

# విజ్ఞాననగరం

మార్సెలుస్ డిసౌజా

బొంబాయి నుంచి బస్‌మీద ప్రయాణం చేసి వైజ్ఞానిక రంగంలో మిక్కిలి ప్రశస్తిని



పొందిన ట్రాంబే చేరవచ్చు. న్యూక్లియర్ పరిశోధక సంస్థ, బాబా ఎటామిక్ పరిశోధక సంస్థ (BARC) ఇక్కడే నెలకొల్పబడ్డాయి. ఈ పరిశోధక కేంద్రంలో వివిధ విభాగాలను సందర్శించినప్పుడు భారతదేశం కన్నులకు కట్టినట్టు కనిపిస్తుంది.

మానవ సమాజంలో శాంతిని సాధించి ప్రత్యేకంగా మానవునికి అనేక విధాల ఉపకరించడానికి ఈ పరిశోధక సంస్థలో న్యూక్లియర్ శక్తి పరిశోధన కొనసాగుతూంది. ఈ విజ్ఞానకేంద్రంలో అనేక నూతన వైజ్ఞానిక విషయాలను కనుగొన్నారు. జాతీయ మరియు అంతర్జాతీయ ప్రశస్తిని పొందిన పరిశోధనా పత్రాలు వందలకొలది ఇక్కడ తయారుచేయబడ్డాయి. ఈ కేంద్రంలో భారతీయ భౌతికశాస్త్రంలో అధిక స్థాయిలో పరిశోధన ప్రారంభమైంది. డా॥ హోమీబాబా

## అభివృద్ధి పొందుతూన్న దేశాల నుండి మల్టీ నేషనల్ కంపెనీలు

అభివృద్ధి పొందుతూన్న దేశాలలో గత రెండు దశాబ్దాలుగా మల్టీనేషనల్ కంపెనీలు ఎక్కువగా వృద్ధిపొందుతున్నాయని అమెరికా హార్వార్డ్ బిజినెస్ స్కూలు ప్రొఫెసర్ లూయి టి. వెల్స్ చెబుతున్నారు. మూడవ ప్రపంచానికి చెందిన అనేకవందల మల్టీ నేషనల్ కంపెనీలను గురించి వాల్‌స్ట్రీట్ జర్నల్‌లో ఈయన ప్రచురించిన వ్యాసంలో భారతదేశపు బిర్లా కంపెనీలు, ఫిలిప్పైన్స్‌కు చెందిన యునైటెడ్ లాబొరేటరీస్, మెక్సికోకు చెందిన అట్లాస్ పేర్కొనబడ్డాయి.

"తప్పుదారిలో పరుగెత్తినా లాభంలేదు." —జర్మన్ సామెత

ఆధ్వర్యంలో భారతదేశపు తొలి అటామిక్ పవర్ ప్రాజెక్టు ఇచ్చట చేపట్టబడింది.

వివిధ సాధన సంపత్తులతో, సాంకేతిక విషయాలతో ఒక్కొక్కటి ఒక్కొక్క బృహత్‌సంస్థ అని చెప్పుకోతగ్గ అరు లాబొరేటరీలు ఇక్కడ ఉన్నాయి. పరిశోధక బృందంలో 7000 మంది వైజ్ఞానిక శాస్త్ర విపులు ఉన్నారు. ఇచ్చట మిక్కిలి ఆశ్చర్యకరమైనది ఒక కిలోమీటరు పొడవు గల మాడ్యూలర్ లాబొరేటరీ. ఇక్కడ వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు వివిధ లేబొరేటరీలలో నిరంతరం పరిశోధనలు చేస్తూ ఉంటారు.

గామాగార్డెన్: మరో ముఖ్యమైన ప్రదేశం గామాగార్డెన్. క్రొత్త క్రొత్త రకాల మొక్కలమీద కొబాల్టు-60 కిరణాలు ప్రసరింపబడతాయి. మొక్కలమీద నాలుగు తరాలవరకు రేడియేషన్ ఫలితాలను పరిశీలిస్తారు. 4,500 కి.గ్రా. మొదలు 7,500 కి.గ్రా. వరకు మిక్కిలి అధిక దిగుబడినిచ్చే సోనా, జయా, TR 20, SR 268, TR 17 మొదలైన వరి రకాలు ఈ సంస్థ దిగ్విజయ సాధనలు. మరో విభాగం ఫుడ్ ప్రిజర్వేషన్ కాంప్లెక్స్. ఇక్కడ ఆహార పదార్థాలు బూజుపట్టి చెడిపోకుండా నిల్వ ఉంచేందుకు వీటిమీద రేడియేషన్ ప్రభావాన్ని తెలుసుకుంటారు. ఐసోమ్డ్ అనే కాంప్లెక్స్‌లో గామా కిరణాలతో వైద్యపరికరాలు, ఇతర సామగ్రులు స్టెరిలైజ్ చేయబడతాయి. BARC పరిశోధక సంస్థలో అప్సరా రియాక్టర్ చూడడానికి ఎంతో రమ్యంగా ఉంటుంది. అనేక వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు దీనిని ఒక సుప్రసిద్ధ వైజ్ఞానిక సంస్థగా రూపొందించారు.

(పార్థ బులెటిన్ సౌజన్యంతో)

(28 వ పేజీ తరువాయి)

అనేక క్రొత్త పోకడలను ప్రవేశపెట్టారు. తొలి చారిత్రిక నవలా రచయిత. 'శివకామి యిన్ శపథం', 'పార్థిబన్ కనవు', పొన్నియిన్ సెల్వన్', 'అలై ఓసై', మొదలైన నవలలు రచించారు.

# 1,676 కి. మీ. ల రైలు మార్గానికి కాంక్రీటు స్లీపర్లు



1968 సం. లో రైలుప్రమాదాల విచారణ సంఘం సిఫారసులను అనుసరించి మొత్తం ఇప్పటికి 1,676 కి. మీ రైలు మార్గం మిక్కిలి భారవంతమైన ప్రిస్ట్రెస్డ్ (Pre-stressed) కాంక్రీటు స్లీపర్లతో అమర్చబడింది. రైల్వే అధికారులు 35 లక్షల కాంక్రీటు స్లీపర్లను సేకరించి జాగ్రత్త పరచారు.

"ఒకరు నీకు చేయకూడదనేది నీవు మరొకరికి చేయకు." —జార్జి బెర్నార్డ్‌షా

# ప్రపంచ వార్తలు

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద సౌర సరస్సు:

యు. ఎస్. ఆర్మీ ఇంజనీర్ల అధికారంలో అమెరికాలో ఫోర్టు బెన్నింగ్‌వద్ద ప్రపంచం లోనే మిక్కిలి పెద్ద సౌరసరస్సు (solar Pond) నిర్మాణం పూర్తి అయింది. 11 ఎకరాల విస్తీర్ణంలో ఏర్పాటైన ఈ ప్రాజెక్టు వల్ల ఇక్కడ 26 బ్యారక్‌లలో నివసించే 6,500 మందికి వేడినీటిని సరఫరా చేస్తున్నారు మెరిసిపోతూ వుండే సౌరఫలకాలు (glazing solar panels) 89 శాతం సౌర శక్తిని ప్రసారం చేస్తాయి. ఈ వేడికి నల్ల ప్లాస్టిక్ సంచులలో ఉండే నీళ్ళు 140F నుంచి 160F డిగ్రీల వేడెక్కుతాయి కంప్యూటర్ విధానంలో పనిచేస్తూ నియంత్రింపబడే ఈ ప్రాజెక్టు నిర్మాణానికి 40 లక్షల డాలర్లు ఖర్చు అయింది.

* * *

## 500 లక్షల సంవత్సరాలనాటి

రష్యాలో విజ్ఞానశాస్త్ర నిపుణులు 500 లక్షల సంవత్సరాలనాటి నీటి బిందువును కనుగొన్నారు. ఇది మధ్యఆసియా పామీర్ కొండలలో ఒక చిన్న రాతి స్ఫటికంలో భద్రపరచబడింది. దీని అధ్యయనంవల్ల ప్రాచీనకాలానికి సంబంధించిన అనేక అద నపు విషయాలు బయల్పడగలవని ఊహింప బడుతూంది.

## 10,000 లక్షల డాలర్లతో పసిఫిక్ మహాసముద్రాలకు లింకు కాలువ:

హిందూ మహాసముద్రాన్ని పసిఫిక్

---

## మానవుడిలా ఆహారాన్ని పట్టుకునే పక్షి



సాండ్‌విచ్ తింటున్న మానవుడిలా తన ఆహారాన్ని పట్టుకునే పక్షి చిలుక ఒక్కటే. మంచి వర్ణమయమైన ఈకలు, గట్టి ముక్కు గల ఈ పక్షి కుడికాలుగానీ, ఎడంకాలుగానీ ఉపయోగిసుంది.

"జీవితంలో కష్టాలను మూడు విధాల భరించవచ్చు: ఉదాసీనత వల్ల, తత్త్వజ్ఞానం వల్ల, ధర్మం వల్ల." — ఛార్లెస్ కోల్టన్

మహాసముద్రాన్ని కలిపే దగ్గరదారి వాణిజ్య మార్గం ఇస్తమస్ ఆఫ్ క్రోట్ మీదుగా 64 కి.మీ. కాలువ త్రవ్వకానికి థాయిలాండ్ ప్రభుత్వం ఒక ప్రణాళికను సిద్ధం చేసింది. 10,000 లక్షల డాలర్లతో ఈ ప్రాజెక్టు పూర్తి అయేసరికి ఇప్పుడు ఇరుకైన మలాకో జలసంధిగుండా ప్రయాణించేపే నౌకలకు దగ్గర జలమార్గం ఏర్పడుతుంది.

* * *

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద రెండవ న్యూక్లియర్ పవర్ ప్రోగ్రామ్:

అణుబాంబుకు గురై తీవ్రంగా ధ్వంసం అయిన జపాన్ ప్రపంచంలో రెండవ పెద్ద న్యూక్లియర్ ప్రోగ్రాంను చేపట్టింది. ప్రస్తుతం జపానులో 17 శాతం విద్యుచ్ఛక్తిని న్యూక్లియర్ ప్లాంటులు జనింపజేస్తున్నాయి. 2000 సంవత్సరం నాటికి దీనిని 30 శాతానికి పెంచడానికి ప్రభుత్వం ప్రణాళికలు ఏర్పాటు చేస్తున్నారు. ఫ్రాన్స్ ఈ శతాబ్దాంతానికి న్యూక్లియర్ ప్లాంటుల నుండి 85 శాతం విద్యుత్తును జనింపజేస్తుంది.

* * *

## చెత్తాచెదారంలో సౌభాగ్యం:

పశ్చిమ జర్మనీలో రైన్ నదీతీరంలో సియున్ (కలోన్ దగ్గర) సంస్థ తొలిసారిగా ఊళ్ళో పోగైన చెత్తకు, ఫ్యాక్టరీలలో చేరిన చెత్తకు ఆర్థిక పారిశ్రామిక పునర్వ్యవస్థీకరణ సౌలభ్యాన్ని కలిగిస్తుంది. నగరంలో లభించే చెత్తలో 80 శాతం ఇనుము, 60 శాతం ఇతర లోహాలు మరియు ప్లాస్టిక్, 50 శాతం కాగితం పునర్వ్యవస్థీకరింప వీడవచ్చని పరిశోధనల వలన తెలియవచ్చింది. ఈ సంస్థ నిర్మాణానికి రూ. 8 కోట్లు ఖర్చు అవుతుంది. సాలీనా పైవేటు చెత్తకుండీలలో సుమారు 12,000 టన్నుల చిత్తుకాగితం, ఫ్యాక్టరీల చెత్త 6,000 టన్నులు లభిస్తుంది.

* * *

## ప్రపంచంలో ఎలక్ట్రిసిటీ జనరేషన్‌లో ఫిన్‌లాండ్‌దే ప్రథమ స్థానం:

అంతర్జాతీయ అటామిక్ ఏనర్జీ ఏజెన్సీ సేకరించిన వివరాలనుబట్టి ఫిన్‌లాండ్ (వాయవ్య యూరప్) 40.3 శాతం న్యూక్లియర్ విద్యుచ్ఛక్తిని సరఫరా చేస్తూ ప్రపంచ 'లీగ్ టేబిల్'లో అగ్రగణ్యతను సంపాదించింది. 38.7 శాతం సరఫరా చేస్తూన్న ఫ్రాన్సుది ద్వితీయస్థానం. ●

---

## ఒంటెలమీద తపాలా ఆఫీసులు

రాజస్థాన్ థార్ ఎడారులలో కార్డులు, కవరుల అమ్మకం డెలివరీ మొదలైన తపాలా వ్యవహారాలన్నీ ఒంటెలమీద జరుగుతాయి. జెయిసాల్మర్ నగరంలో మాత్రం 20 ఒంటె తపాలా ఆఫీసులు పనిచేస్తున్నాయి.

---

"ఆత్మ విస్మృతి కలిగేవరకు దైవాన్ని ధ్యానించు." —సామ్‌సీ టాబ్రిజ్

# ప్రజాప్రభుత్వం అంటే ఇదే!

యుద్ధం ముగిసిన వెంటనే లేబరు ప్రభుత్వం అధికారంలో ఉంటూండగా నేను ఇంగ్లండ్ లో చదువుకుంటున్నాను. ఒక ఆదివారం సెలవురోజున లండన్ సమీపంలో ఉన్న ఒక ఊళ్ళో నా స్నేహితుడి దగ్గరకు వెళ్ళాను. ఆ రోజుల్లో బజారులో అన్నిటికీ ఎంతో గిరాకీ ఉండేది. గ్రుడ్లు, వెన్న, పంచదార, జోళ్ళు, తువ్వాళ్ళు, దుప్పట్లు ఏవీ దొరికేవి కావు నేను - నా స్నేహితుడు చేపలు, చిప్స్ కొనుక్కుందామని ఒక చేపల కొట్లోకి వెళ్ళాం తీరా చూస్తే అక్కడ పెద్ద 'క్యూ'. మా వంతు వచ్చేదాకా నుంచోవలసి వచ్చింది. క్యూలో నా ముందు ఒక వృద్ధుడు నుంచున్నాడు. ఎక్కడో చూచిన ముఖంలాగే ఉంది. పేరు జ్ఞాపకం రావడం లేదు. అతడు ఒక చిన్న కుర్రాడితో మాట్లాడుతున్నాడు. ఆ బాలుడు వృద్ధుని మనుమడై ఉండవచ్చు. వారిద్దరూ క్రికెట్, చాక్లెట్లు గురించి మాట్లాడుకుంటున్నారు.

చటుక్కున జ్ఞాపకం వచ్చింది. ఆ వృద్ధుడు ఇండియా సెక్రటరీ ఆఫ్ స్టేట్ పెతిక్ లారెన్స్. కాబినెట్ మిషన్ పని ముగించుకుని ఇండియా నుంచి అప్పుడే తిరిగి వచ్చాడు. అతని చేతిలో ఒక పాత న్యూస్ పేపరు ఉంది. ఆయన వంతు వచ్చేటప్పటికి ఆ న్యూస్ పేపరు కొట్టువాడి చేతికి ఇచ్చాడు. అంగడి వాడు వెంటనే కొన్ని చేపలు కాగితంలో కట్టి ఇచ్చాడు. ఇద్దరూ ఇంటికి నడుచుకు చక్కా పోయారు.

వెనకాల బాడీగార్డులు లేరు. భద్రతాదళం లేదు. ఆర్భాటం లేదు. మంత్రి పదవిని అధిష్ఠించినా మన అందరిలాగే సాధారణ పౌరుడు లాగ క్యూలో నిలిచి సరుకులు కొనుక్కుపోయాడు

ఆయన నియమించిన వైస్రాయి భారతదేశంలో వైస్ రీగల్ లాడ్జి (న్యూఢిల్లీ) లో 6000 మైళ్ళ దూరంలో విలాసంగా విందులు ఆరగిస్తున్నాడు ●

(జై. దుభాషి, ఆర్గనైజర్)

## గట్టిపడే రక్తాన్ని కరిగించే ఔషధం

గడ్డకట్టిన రక్తాన్ని కరిగించి, సక్రమంగా రక్తాన్ని హృదయానికి ప్రవహింపజేసి గుండె దెబ్బను తగలనీయని క్రొత్త ఔషధం టిస్యూ ప్లాస్మినోజెన్ ఆక్టివేటర్ (Tissue Plasminogen Activator) అమెరికాలో రోగులమీద ప్రయోగింపబడి 60 శాతం మందికి ఇది చాలా అమోఘంగా పనిచేసినట్లు తెలుసుకున్నారు. ఈ మందు మానవ శరీరంలో చాలా స్వల్పంగా ఉంటుంది.

"భాగ్యవంతుల కుదరని రోగాలు ధనంతో కుదరని రోగాలే." -అగ్డెన్ నాష్

# మీకు తెలుసా?

నీరు అత్యధిక వినియోగం:

జెకోస్లోవేకియా వాస్తవ్యులు బీరును అత్యధికంగా ఉపయోగిస్తారు.

* * *

ప్రపంచంలో ఘాటైన బీరు:

ప్రపంచంలోనే మిక్కిలి ఘాటైన బీరు కుల్మినేటార్ యుర్‌టిప్ హెల్.

* * *

రోమ్ ప్రశస్తి:

ఇటలీదేశపు ముఖ్యపట్టణమైన రోమును-ప్రాచీన ప్రపంచపు మహారాణి, శాశ్వత నగరం, పశ్చిమ బాబిలోన్, స్కార్లెట్ హోర్ అంటారు.

యూరప్ కాక్‌పిట్:

బెల్జియం యూరప్ కాక్‌పిట్ (యుద్ధ రంగం).

* * *

మాతృ పార్లమెంటు:

బ్రిటిష్ పార్లమెంటుని మదర్ ఆఫ్ పార్లమెంట్సు (Mother of Parliaments) అంటారు.

'సౌత్‌పా' అంటే?:

కుడిచేతికి బదులుగా ఎడంచేయి ఉపయోగించే వారిని సౌత్‌పా (southpaw) అంటారు.

* * *

యు.ఎన్.ఒ. ఎప్పుడు స్థాపించబడింది?:

యు.ఎన్.ఒ. 1945లో స్థాపించబడింది. యునైటెడ్ నేషన్స్ చార్టరు 1945 అక్టోబర్ 24వ తేదీన అమలులోకి తెచ్చారు.

## తీరని సమస్య




ఇప్పుడు కాదు. మంత్రిగారు చాలా పనిగా ఉన్నారు. ఇంకోరోజు రండి.

"సద్వచనాలు విని ప్రయోజనం లేదు. వాటిని నిత్యకృత్యంలో ఎంతవరకు ఆచరణలోకి తెస్తున్నా మనేదే ముఖ్యం." —స్వామి వివేకానంద

'హెర్రింగ్‌పాండ్' అంటే?:

ఉత్తర అట్లాంటిక్ మహాసముద్రాన్ని హెర్రింగ్‌పాండ్ అంటారు.

* * *

'డిస్మల్ సైన్స్' అంటే?:

ఆర్థిక శాస్త్రాన్ని 'డిస్మల్ సైన్స్' అంటారు.

* * *

ప్రపంచంలో మిక్కిలి వేగవంతమైన రైలు:

ఫ్రాన్స్‌దేశపు టి.జి.వి. ప్రపంచంలోనే మిక్కిలి వేగవంతమైన రైలు.

* * *

ఆంగ్లంలో సానెట్ వ్రాసిన తొలి కవి:

ఆంగ్లంలో అంత్యనియమం ఉండే పద్నాలుగు పంక్తుల సానెట్ పద్యం వ్రాసిన కవి ఇటలీదేశపు పెట్రార్క్.

* * *

పార్లమెంటు మిక్కిలి దీర్ఘకాల సమావేశం:

పార్లమెంటు చరిత్రలో లోక్‌సభ సెప్టెంబర్ 16, 1981 న ఎసన్షియల్ సర్వీసెస్ మెయింటెనెన్స్ బిల్ ఆమోదించబడడానికి విరామం లేకుండా 17 గంటలకాలం సమావేశమైంది. అదే బిల్లును ఆమోదించడానికి రాజ్యసభ సెప్టెంబర్ 17-18 తేదీలలో 18 గంటల దీర్ఘకాలం సమావేశమైంది.

'ప్రావ్‌డా' స్థాపించినది ఎవరు?:

రష్యాలో ప్రచురింపబడే వార్తా పత్రిక

# నిమ్మచేసే మేలు



అనేక రోగాలకు దివ్య ఔషధంగా నిమ్మ ఎంతో ముఖ్యమైన పాత్ర వహిస్తుంది. నిమ్మరసం శరీర చర్మానికి ఆరోగ్యవంతమైన రక్ష. చర్మానికి నిమ్మరసం పట్టించి ఆరనివ్వండి. మొటిమలు, పొడుపులు కాయలు, ఎండదెబ్బవల్ల వాడిపోవుట, తామర మొదలగు అనేక చర్మవ్యాధులను నిమ్మరసం నివారిస్తుంది. చర్మంమీది ముడతలు పోవడానికి కూడా నిమ్మరసం అమోఘమైన సౌందర్యవర్ధిని. ముడతల మీద నిమ్మరసం పట్టించి కొద్ది గంటలసేపు ఆరనిచ్చి తరువాత కడిగి కొబ్బరినూనె గాని, ఆలివ్ నూనె గాని రాయండి. తలలోవచ్చే చుండ్రు నివారణకు నిమ్మరసం తలకు కూడా పట్టించవచ్చు.

"ఎవరైతే ఇతరులకోసం బ్రతుకుతున్నారో
వారే నిజమైన మానవులు." —స్వామి వివేకానంద

'ప్రావ్డా' (Pravda) సంస్థాపకుడు లెనిన్.

•

న్యూట్రాన్ కనిపెట్టినది ఎవరు?:

జేమ్స్ చాడ్విక్ న్యూట్రాన్‌ను కనిపెట్టాడు.

•

కాంతి తరంగాలు ఎలా కొలవబడతాయి?:

కాంతి తరంగాలు ఆంగ్‌స్ట్రామ్ (Ang-strom) మానంలో కొలవబడతాయి.

• • •

ప్రపంచంలో విశాల ప్రదేశం ఏది?:

ప్రపంచంలో మిక్కిలి విశాలమైన ప్రదేశం సోవియెట్ యూనియన్.

• • •

జాతీయ పాడి పరిశోధక సంస్థ ఎక్కడ వుంది?:

జాతీయ పాడిపరిశోధక సంస్థ హర్యానా రాష్ట్రంలో కర్నాల్‌లో కలదు.

పెట్రోలుయొక్క ప్రేలుడు శక్తి:

ఒక గాలను పెట్రోలుకి 77 పౌండ్ల డైనమైట్ ప్రేలుడు శక్తి ఉంటుంది.

• •

యు.ఎస్. కాంగ్రెస్ లైబ్రరీలో 730 లక్షల గ్రంథాలు:

యు ఎస్. కాంగ్రెస్ లైబ్రరీలో 730 లక్షల గ్రంథాలు భద్రపరచబడ్డాయి ఈ లైబ్రరీలో షెల్ఫులు ఆక్రమించిన స్థలం పొడవు 850 మైళ్ళు.

• • •

క్రైస్తవులలో రోమన్ కాథలిక్కులే అధిక సంఖ్యాకులు:

ప్రపంచంలో అన్ని క్రైస్తవుల శాఖల మొత్తం కంటే రోమన్ కాథలిక్కులే అధిక సంఖ్యలో ఉన్నారు. ●

## స్పెషల్ బ్రెడ్‌లో 25 శాతం ఎక్కువ పీచు



అమెరికాలో ఒక రొట్టెల తయారీదారుడు ప్రత్యేకమైన రొట్టెను తయారు చేసాడు. సాధారణమైన రొట్టెలోకంటే ఈ రొట్టెలో 25 శాతం అధికంగా పీచు (Fibre) ఉంటుంది. ఈ పీచు పొడిచేయబడిన సెల్యులోజు. మంచి రుచికరమైన ఈ రొట్టెముక్కలు ప్రతిరోజూ తింటే శరీర భారం 2 నెలలకే సుమారు 3 కి. గ్రా. తగ్గిపోతుంది.

"మీరు జీవితాన్ని ప్రేమిస్తున్నారా? అయితే కాలం వృధా చేయకండి - కాలగర్భంలోనే జీవన సుగంధం ఉంది." —బెంజిమిన్ ఫ్రాంక్లిన్

# కలంస్నేహితులు

[మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈ శీర్షిక క్రింద ప్రచురించబడాలంటే తగిన వివరాలతో సహా రూ. 5/- లు మనియార్డరు ద్వారా పంపండి. —సంపాదకుడు]

1. ఎస్ సాంబశివరావు, 17 సం.లు, ఇంటర్ విద్యార్థి S/o మల్లికార్జున రావ్, ఇం. నెం. 1-26 కృష్ణా టాకీసు వద్ద, సత్తుపల్లి, ఖమ్మం జిల్లా—507 303.

పుస్తక పఠనం, ప్రకృతి పరిశీలన, విజ్ఞాన దాయక విషయాలు తెలిసికొనుట.

2. జి. సత్యనారాయణ, 19 సం.లు, బి ఏ, S/o గుర్రపు నర్సయ్య, ఫాన్సీ క్లాత్ స్టోర్స్, స్టేషన్ రోడ్, మహబూబాబాద్, వరంగల్ జిల్లా-506 101.

లైబ్రరీకి వెళ్ళడం, వ్యాసాలు వ్రాయడం, సంఘ సేవ చేయడం.

3. ఎస్. శశికాంతరావ్, తొమ్మిదవ తరగతి విద్యార్థి, S/o సాంబయ్య (టీచర్), నెన్నెల—504 2 9, బెల్లంపల్లి, (వయా) ఆదిలాబాద్ జిల్లా.

పుస్తక పఠనం, కలం స్నేహం, దైవ భక్తి.

4. కె. కృష్ణకుమారి, D/o ఎస. నాగమణి, హుకుంపేట పోస్ట్, రాజమండ్రి తాలూకా, (తూ.గో. జిల్లా), 533 103.

నవల్స్ చదవడం, రేడియో వినడం.

5. యరగర్ల వెంకటేశ్వర్లు, కొత్తపల్లి పోస్టు, మాచర్ల తాలూకా, (గుంటూరు జిల్లా) 522 426.

అందరితో స్నేహం, పత్రికలు చదవడం, పజిల్స్ పూర్తి చేయడం

## ప్రపంచంలో అతి పురాతనమైన అడవి పశువులు



ప్రపంచంలోనే అతి పురాతనమై అంత రించి పోతూన్న కాంపూచియన్ అడవి ఎద్దు(కూప్రే)ఈమధ్య థాయ్, కాంపూచియాల సరిహద్దు ప్రదేశాలలో దట్టమైన అడవులలో కనిపించింది. ఇది పురాతనమైన పశు జాతికి చెంది. చరిత్రకు పూర్వపు ఎద్దును పోలి ఉంటుంది. థాయిలాండ్ గుహలలో చరిత్రకు పూర్వపు కూప్రే చిత్రాలు చెక్కబడ్డాయి.

"తమకి తాము సాయపడగల వారికే దేవుని సహాయం లభిస్తుంది." —బెంజమిన్ ఫ్రాంక్లిన్

# మహాపురుషుల సతీమణులు

టి. నీలకంఠన్

## 2

జాన్ బి. ఎస్. కోట్స్ దివ్యజ్ఞాన సమాజానికి అధ్యక్షుడు కాకముందు 1952 నం.లో యూరపియన్ కాంప్స్‌లో శరణార్థుల సేవా నిమిత్తం సత్సాంగత్యాభి వృద్ధి సంఘాలు (Wings of friendship organiza-




క్యూరీ మేరీ

tion) ప్రారంభించి దీనమానవసేవకు పూనుకున్నాడు. ఈ ప్రత్యేక ఉద్యమానికే గాక భర్త చేపట్టిన ఇటువంటి ఇతర కార్యక్రమాలకు అతడి భార్య బెట్సాన్‌కోట్స్ అనేక విధాల సహాయపడింది.

బాలభట (Boy Scout) సంఘ సంస్థాపకుడైన లార్డ్ బేడెన్ పవెల్‌కు అతడి సతీమణి ఒలావా చేదోడు వాదోడుగా ఉంటూ బాలభట సంఘాన్ని పోలిన గర్ల్‌గైడ్స్ సంఘాన్ని స్థాపించడానికి సహాయం చేసింది.

1954 సం లో కలకత్తా చర్చిలో కెనడా మిషనరీ మార్క్ బున్‌టైన్ (Mark Buntain) ఉపదేశానికి ఉపక్రమించినప్పుడు

### 2000 సం. లకు పూర్వమే వజ్రాలు భారతదేశంలో లభించాయి

ప్రప్రథమంగా భారతదేశంలో సుమారు 2,000 సం లకు పూర్వం వజ్రాలు లభించాయి. భూమి మీద లభించిన 20 పెద్ద వజ్రాలలో 2 భారతదేశానికి చెందినవే. మొదటిది 1650 సం.లో లభించిన 793 క్యారట్లుతూగే 'ది గ్రేట్ మొగల్'. రెండవది 1835 సం.లో లభించిన 440 క్యారట్లుతూగే 'నైజామ్'. బ్రెజిల్‌లో వజ్రాలు 200 సం. రాలకు పూర్వం కనుగొనబడ్డాయి. దక్షిణ ఆఫ్రికాలో గనులనుండి వజ్రాలు త్రవ్వడం సుమారు 100 సం.లకు పూర్వం ఆరంభింపబడింది.

'నమ్మేటట్లు అబద్ధం సృష్టించుకోలేకపోతే
నిజాన్ని వదలకూడదు.''
—ఏన్ జెలా థిర్ కల్

ఒక భారతీయుడు "మా ఆత్మలకు ఆహారం పెట్టేముందు మా ఆకలి కడుపులకు ఒకింత గంజి పొయ్యండి" అన్న మాటలు విని బున్‌స్టైన్, "మిషన్ ఆఫ్ మెర్సీ" అనే పేరుతో సాంఘిక సంక్షేమ సంఘాన్ని నెల కొల్పారు. బున్‌స్టైన్ ప్రారంభించిన ఈ ఉద్యమానికి అతడి భార్య హల్డా బున్‌స్టైన్ అన్ని విధాలా వినయ విధేయతలతో సహక రించింది.




సోక్రటీసు

విలియం గ్లాడ్‌స్టన్ ఇంగ్లాండు ప్రథమ మంత్రి. అతడి భార్య కాథరీన్. వీరిద్దరూ మిక్కిలి అన్యోన్యంగా 69 సంవత్సరాల పాటు దాంపత్య జీవితాన్ని ఆనందంగా, ఉత్సాహంగా గడిపారు. పెర్రీ క్యూరీ తన భార్య మాడమ్ క్యూరీకి తనపైగల అనన్య సామాన్యమైన అనురాగానికి ముగ్ధుడై తన విజ్ఞాన శాస్త్రపరిశోధన కార్యక్రమాలను విర మించుకుని సమైక్య కృషితో అపూర్వమైన 'రేడియం' ధాతువును కనుగొన్నారు. ఎడ్గార్ అల్లెన్ పో సుప్రసిద్ధ అమెరికన్ రచయిత. ఆర్థికంగా దీనాతి దీనమైన పరిస్థితులను అనుభవిస్తూ ఉన్నప్పటికీ ఆయన సతీమణి వర్జీనియా అత్యంత శ్రద్ధాభక్తులతో పతిసేవ చేసింది.

కొంతమంది మహానుభావులు వినయ వంతులైన భార్యల సహకారానికి నోచుకో లేదు. అట్టివారి జీవితాలు దుర్భర జీవితాలు. సుప్రసిద్ధ గ్రీక్ తత్వవేత్త సోక్రటీసు తన భార్య క్సాన్‌తిప్పే (Xanthippe తో వేగ లేక పరితపించాడు. ఇంట్లో స్నేహితులను చేరనిచ్చేదికాదు మాట్లాడనిచ్చేది కాదు. తిట్టి పోసేది. విరుచుకుపడేది. ఈ పరిస్థితిని భరించలేక ఒక నాడు సోక్రటీసు తన స్నేహితు నితో ఇల్లు వదలి బయట మాట్లాడుకొనే టప్పుడు భరించరాని కోపంతో మేడ మెట్లెక్కి వారిపై బక్కెట్‌తో నీళ్ళు గుమ్మరించింది. సోక్రటీస్ చలించలేదు. "ఉరుములు, పిడు గులు తరువాత వర్షపు చినుకులు" అని సమాధాన పరుచుకున్నాడు.

అబ్రహాం లింకన్ అమెరికా అధ్యక్షుడు. భార్య మేరీటాడ్‌తో ఎంతమాత్రం సుఖపడ లేదు. భార్య ముక్కోపి. ఒకనాడు ఒక హోటలులో అతిథులతో చేరి కాఫీ త్రాగుతూ ఉండగా భర్త చెప్పిన మాటలకు కోపం వచ్చి త్రాగుతూఉన్న వేడి వేడి కాఫీ భర్త ముఖాన విసిరికొట్టింది. ఒకసారి కాదు రెండు సార్లు కాదు అనేకసార్లు ఇలాగే జరిగింది. దీనిని గురించి లింకన్ తన స్నేహితునికి

"మానవులు చేసే మేలు వారి మరణంతోటే నశిస్తుంది.
కీడు మాత్రం కలకాలం ఉంటుంది." —షేక్స్పియర్

ద్రాష్టా 'నేను ప్రతికి దౌర్భాగ్య జీవితాన్ని జీవిస్తున్నాను నా అవస్థ మానవజాతి కంతటికి పంచిపడితే లోకంలో సంతోషవంతుడే కనిపించడు' అని అన్నాడు. లింకన్ 23 సంవత్సరాల కాలం దుర్భర దాంపత్య జీవితాన్ని గడిపాడు.



అబ్రహాం లింకన్

కౌంట్ లియో టాల్ స్టాయ్ కీర్తిగడించిన రష్యన్ నవలా రచయిత, సుప్రసిద్ధ సంఘ సంస్కర్త. భార్య సోఫియా పోరుపడలేక ఒకరోజు రాత్రి చలిగాలిలో, మంచులో ఇల్లు వదలి వెళ్ళిపోయి తరువాత పదకొండు రోజులకు ఒక రైల్వేస్టేషనులో విషజ్వర పీడితుడై మరణించాడు మరణిస్తూ నా గయ్యాళి భార్యని దరిచేరనీయకుండా మరణించేటప్పుడైనా శాంతంగా ఉండనీయమని కోరుకున్నాడు.

సాధారణంగా కుటుంబాలలో పురుషులదే పైచేయి అయినా చాలామంది పురుషులు తమ సతీమణులపట్ల తగు గౌరవ మర్యాదలతో వారి అభిలాషలు, కోరికలను తీరుస్తారు. అమెరికా సైన్యంలో జనరల్ మార్క్ క్లార్క్ మిక్కిలి ప్రఖ్యాతిని పొందిన అధికారి. పది సంవత్సరాలుగా గొలుసు కట్టుగా సిగరెట్లు కాల్చేవాడు. సిగరెట్ల వాసన తనభార్యకు గిట్టదని ఆమెపైగల గాఢ అనురాగ సూచనగా అమాంతం అప్పటికప్పుడే సిగరెట్లను కాల్చడం మానుకున్నాడు. 600 బి.సి కి పూర్వం బాబిలోన్‌ను పాలించే నెబుచద్‌నెజార్ (Nebuchadnezzar) భార్య పట్లగల ప్రేమానురాగాల సూచనగా బాబిలోన్‌లో హాంగింగ్ గార్డెన్స్ కట్టించాడు. ప్రపంచపు 7 అద్భుతాలలో ఇది ఒకటి. 17 వ శతాబ్దంలో మొగలాయి చక్రవర్తి షాజహాన్ భార్య ముంతాజ్‌పై గల ప్రేమాతిశయ సూచకంగా ఆమె జ్ఞాపకార్థం ఆగ్రాలో తాజ్‌మహల్ నిర్మించాడు. ఆసియా మైనర్‌లో కారియా చక్రవర్తి మసోలస్ భార్య అర్టిమీసియా పతిభక్తురాలు. భర్త చనిపోయినప్పుడు 353 బి.సి.లో భర్త జ్ఞాపకార్థంగా కట్టించిన బృహనిర్మాణమే మసోలియం.

రాధా సోమి (Radhasoami) మత సంస్థాపకుడు సోమిజీమహరాజ్. 1878 వ సం.లో సోమిజీమహరాజ్ మరణానంతరం అతడి సతీమణి బువాజీమహరాజ్ భర్త జ్ఞాపకార్థం ఆగ్రాలో గొప్ప స్మారక మందిరాన్ని నిర్మించడానికి నిశ్చయించి దానికి తగిన ప్రయత్నాలు తీసుకుంది. ●

"మంచి చెడ్డలు రెండూ వివేకంతో తెలుసుకుంటే గాని ఎవరంతటవారు మంచిని అనుసరించలేరు." —హెలెన్ కెల్లర్

# మన సాంస్కృతిక సంపద



కంచి కామకోటి పీఠాధిపతి
శ్రీ జయేంద్ర సరస్వతి స్వామి

అతి ప్రాచీన ధర్మంతో, సంస్కృతితో, నాగరికతతో మనదేశం విలసిల్లుతూంది. ఈనాడు దేశం తిరిగి స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తూంది. అంతర్జాతీయంగా ప్రాముఖ్యత ఏర్పడింది. ఇట్టి మనదేశం యొక్క ఔన్నత్యానికి, గౌరవానికి కారణమేమిటి? పారిశ్రామికంగా మనం అనుభవిస్తున్న ప్రగతి కారణం కాదు. ఇతర దేశాలతో సరిపోల్చినప్పుడు మన దేశపు ప్రాచీన ధర్మం, సంస్కారం, నాగరికత ప్రతివ్యక్తికి మానసిక శాంతిని, ధైర్యాన్ని కలిగిస్తూంది కాబట్టే.

భారతదేశం ఆధ్యాత్మిక రంగంలో మిక్కిలి ప్రగతిని చెంది ఏ వ్యక్తికైనా ఆత్మశాంతి అతి సులభంగా కలిగిస్తూంది. ఏదో కొంత సొమ్ము వెచ్చించి ఆత్మశాంతిని కొని సంపాదించలేం. అంతరంగిక పరివర్తనను పొందినప్పుడే ఈ ఆత్మశాంతిని అతి సులభంగా పొందవచ్చు. మన పవిత్రదేశంలో అట్టి అంతరంగిక పరివర్తన సులభసాధ్యం. అందుచేతనే అనేకమంది పాశ్చాత్యులు మన సంస్కృత భాషను, మన నాగరకతను అభ్యసిస్తున్నారు. వారికి మన సంస్కృతియందు, మన భాషయందు, మన నాగరకతయందు పరిపూర్ణ విశ్వాసం ఉందికాబట్టి వారు దానిని అవలంబించి అలవరచుకుంటున్నారు. కాని మన దేశీయులు మన సంస్కృతిని, మన నాగరకతను, మన ధర్మాన్ని విడిచి పాశ్చాత్య నాగరకతకు మోజు పడిపోతున్నారు. విదేశీయులకు మన ఆచార వ్యవహారము లయందు ఆశక్తి అధికం. మన దేశీయులు విదేశీయులను అనుకరిస్తున్నారు. అందుచేతనే దేశంలో అశాంతి, కలవరం ప్రబలిపోయింది. మనకే మనశ్శాంతి లేనప్పుడు ఇతరులకు మనశ్శాంతిని ఎట్లీయగలం? ●

('కామకోటి వాణి' సౌజన్యంతో)

---

"ప్రపంచం క్షణికం. మూర్ఖులతో గడిపే దీర్ఘకాలం కంటే వివేకులతో గడిపే క్షణం మేలు."

# పది ఆదేశాలు



1. నీ మంచిని నీ ఇరుగు పొరుగు వారి మంచిని కూడా ఎల్లప్పుడూ అభిలషించాలి.

2. ప్రపంచంలో అందరి ఆరోగ్యానికీ, సౌభాగ్యానికీ, ఆనందానికీ సహకరించాలి.

3. మంచి వెలుతురునీ, గాలినీ, పరిశుభ్రమైన నీటిని అభిలషించాలి.

4. ప్రతి దినం 8 గంటలసేపు నిద్రపోవాలి.

5. మితంగా తినాలి. ఆరు బయట వ్యాయామం చేయాలి.

6. తల్లిని గౌరవించాలి. నీకు సహకరించిన స్నేహితులను విశ్వసించాలి.

7. అందరిలో దివ్యత్వాన్ని గ్రహించి ఆరాధించాలి.

8. నిత్య కార్యక్రమాన్ని జ్ఞాపకంతో అనుసరించాలి.

9. ఇతరులకు సహకరిస్తే నీకు నీవు సహకరించుకుంటున్నావనే విషయం జ్ఞాపకం పెట్టుకో. ఒకరికి బాధ కలిగిస్తే నీకు నీవు బాధ కలిగించుకోడమే. ఇతరులను ప్రేమిస్తే దీర్ఘ కాలం పాటు జీవిస్తావు.

10. ప్రకృతినంతనీ నడిపించే శక్తి ఒక్కటే అని గ్రహించి ఆకాశంలో నక్షత్ర రాశిని, సముద్రాలలో నీటిని, అడవులలో చెట్లను ఆరాధించు.

—ఎల్బర్ట్ హబ్బర్డ్

(24 వ పేజీ తరువాయి)

## భారతదేశంలో మిక్కిలి పెద్ద ఉష్ణమండలపు బొటానికల్ గార్డెన్స్:

తిరువనంతపురం (కేరళ) పాలోడ్‌లో భారతదేశపు మిక్కిలి పెద్ద ఉష్ణమండలపు వృక్షవాటికలు ఏర్పాటు చేస్తున్నారు. ఈ వాటికలలో అర్ధభాగం ఆర్బోరేటమ్ (వృక్ష) సంబంధమైనది. వీటిలో కేరళలో వృక్ష సంపదేగాక భారతదేశ మందలి వృక్ష సంపద కూడా ఉంటుంది. ఇతర ఉష్ణ ప్రదేశాల నుండి ఆర్థికాభివృద్ధికి సహకరించే చెట్లు ప్రవేశపెట్టబడతాయి. ●

"సాగిల పడటం అవమానం,
అపాయం. కాని పడిపోవడం కాదు." —జొనాథన్ స్విఫ్ట్

# ఆరోగ్యానికి సూత్రాలు

ఒక గాజు కప్పులోకి నిమ్మకాయ రసం పూర్తిగా పిండండి. బ్రష్‌తో పళ్ళకు పట్టించి తోమండి. ఆమ్లజనకమైన సూక్ష్మజీవులను నశింపజేయడమే గాకుండా కొద్దిరోజులకు పళ్లు బాగా తెల్లబడతాయి.

గుండె జబ్బులకూ, హృదయానికి సంబంధించిన ఇతర రోగాలకూ నారింజ ఎంతో అమూల్యమైనది. పైతొక్క ఒలిచి తొనలు తీసి తేనెలో 2 లేక 3 గంటలసేపు



నానబెట్టి తీసుకోండి. ఐస్‌పెట్టిన కుండలలో వీటిని చల్లబరిస్తే ఎంతో సువాసనగా ఉండి ఆరోగ్యానికి మేలు చేకూరుస్తుంది.

* * *

ప్రతీరోజూ ఒక జామపండు తింటే మలబద్ధత వుండదు. రాత్రి భోజనం అయిన తరువాత జామపండు తినడం ఎంతో ఉత్తమం.

* * *

ఉబ్బసంతో ఆయాసపడిపోతూ ఉంటే బాగా పండిన అరటిపండును వెచ్చచేసి కొద్దిగా మిరియాలపొడి అద్ది తింటే వెంటనే ఉపశమనం కలుగుతుంది.

* * *

కారట్‌కు టానిక్ దుంప అని పేరు. ఇది పసిబిడ్డలకు, యువకులకు, యువతులకు, వృద్ధులకు దేహాభివృద్ధికి. ఆరోగ్యానికి అమోఘమైంది. పది పదిహేనురోజులు విడవకుండా ప్రతిదినం తింటే చర్మ రోగాలకు వేరేమందులు అవసరంలేదు. మూత్ర విసర్జనప్పుడు కలిగే మంట తగ్గడానికి, సౌందర్యాన్ని పోషించి అధికం చేసుకోడానికి దీన్ని మించినది లేదు. పాలు మరింత తియ్యగా, పుష్టికరంగా, రుచిగా వుండడానికి ఆవులకు గడ్డితోపాటు కారట్లు ఇస్తారు.

## బ్రిటిషువారు సత్ప్రవర్తనను అభిలషిస్తారు

మూటికి రెండు వంతులు బ్రిటిషువారు మిక్కిలి ముఖ్యమైనదనే 17 గుణాలలో నిర్వచించిన మంచి నడవడిని అభిలషిస్తారు. యూరోపియనులలో ఫ్రెంచివారు పొదుపుకు ఎక్కువ ప్రాముఖ్యత నిస్తారు. సత్ప్రవర్తనకు 10 వ స్థానం ఇస్తారు

"ఒక మూర్ఖుని మెచ్చుకోడానికి ఎప్పుడూ అతణ్ణి మించిన మూర్ఖుడు మరొకడు ఉంటాడు." —బోలియో

# బహుమతి పొందిన వ్యాసం

# మనిషి దైనందిన జీవితంలో హాస్యం విలువ

ఎమ్. లక్ష్మి, శ్రీకాళహస్తి.

మానవుని పుట్టుక ఏడుపుతో మొదలైనా మనిషి దైనందిన జీవితంలో హాస్యం ప్రధాన పాత్ర వహిస్తుంది. నవరసాలలో హాస్యం ఒకటి.

చిన్నపిల్లల వచ్చీరాని మాటలు, పిల్లల చేష్టలు, కథలు, నాటకాలలో, చలనచిత్రాలలో హాస్య నటుల ప్రభావాలు, కార్టూనిస్టు వ్యంగ్య చిత్రాలు, సర్కస్‌లోని జోకర్ చేష్టలు, గారడి, అనుకరణ ప్రక్రియలు, చమత్కార సంభాషణలు, రచనలు హాస్యాన్ని అందిస్తాయి హాస్యం విలువ ఇంత అని నిర్ణయించడం సాధ్యం కాదు. హాస్యం ఆబాల గోపాలాన్ని అలరిస్తుంది. శ్రమించే కార్మికునికి, కష్టపడి చదివే విద్యార్థికి, బాధ్యత గల ఉద్యోగికి, ఆదర్శ గృహిణికి, కుంటివానికి, గ్రుడ్డివానికి. స్త్రీకి, పురుషునికి, పసిపాపకు, ఏ మరికి సైతం హాస్యం అవసరం.

దుఃఖ జీవితం అనే ఎడారిలో హాస్యం ఒయాసిస్ వంటిది. వారి వారి కర్తవ్య నిర్వహణలో అలసినవారికి హాస్యం చల్లని గాలివంటిది. అనారోగ్యులకు హాస్యం టానిక్ లాంటిది. హాస్యంవల్ల సంతోషం కలుగుతుంది. సంతోషం వల్ల సగం బలం చేకూరుతుంది. మానసిక, శారీరక ఉత్సాహానికి

---

## నిర్విరామ ప్రసంగంలో కొత్త ప్రపంచ రికార్డు



శ్రీలంకాకు చెందిన 16 సం॥ల విద్యార్థి కపిలకుమార్ నిర్విరామంగా 164 గంటల కాలం ప్రసంగించి క్రొత్త ప్రపంచ రికార్డును స్థాపించాడు. ఇంతకుముందు ఆక్స్‌ఫర్డ్ (ఇంగ్లండు)లో విరామం లేకుండా 150 గంటలు ప్రసంగించిన రేమాండ్ కాంట్‌వెల్‌ను జయించిన కపిల బౌద్ధ ధర్మాన్ని గురించి ప్రసంగించాడు.

"ప్రగతి కుంటుతూనే వస్తుంది." —మహాత్మాగాంధీ

ఆహ్లాదం కలిగిస్తుంది. గర్భవతి హాస్యాన్ని ఆనందిస్తే గర్భస్థ శిశువు జీవితమంతా హాస్యానుభూతిని కలిగి ఉంటుందంటారు. హాస్యాన్ని అందివ్వడమే వృత్తిగా గలిగి జీవనం గడపవచ్చు. తెనాలి రామకృష్ణుడు, బీర్బల్ హాస్యగాళ్ళుగా ప్రసిద్ధి వహించారు. వారు హాస్యం ద్వారా రాజులను వశపరచు కోడమే గాక ఎన్నో విపత్తుల నుండి బయట పడినట్లు తెలుస్తుంది. హాస్యాన్ని పొందే వాడు ఇతరులకు దానిని అందివ్వగలడు. హాస్యాన్ని అనుభవించే వ్యక్తి పరిపూర్ణమైన మనిషి. అతి హాస్యం పనికి రాదు అతి హాస్యం అపాయానికి దారితీస్తుంది. తలిదండ్రులతో, గురువులతో, అధికారులతో హాస్యాలాడరాదు.

విసుగుకు విరుగుడు హాస్యం. మనిషికి నీరు ఎంత అవసరమో హాస్యం కూడా అంతే అవసరం. కాబట్టి హాస్యం విలువను గ్రహించి దానిని సక్రమంగా వ్యాపింపచేయాలి.

ఎస్. మాధవి, శ్రీశైలం ప్రాజెక్ట్.

నవరసాలలో ఒకటి అయిన హాస్యం మనిషి దైనందిన జీవితంలో ప్రముఖ పాత్రను వహిస్తుంది. హాస్యం లేకుండా మానవుని జీవితం ఎడారిమయం.

నవ్వు ఒక జీవన సరళి. జీవితంలో నవ్వదగిన విషయాలేమిటో తెలిసికొని నవ్వ కూడని విధంగా నవ్వకుండా నవ్వవలసిన [illegible]లో నవ్వించే నేర్పే హాస్యం.

నవ్వటం, నవ్వించటం మనిషికి మాత్రమే భగవంతుడిచ్చిన గొప్ప వరం. హాస్యాన్ని అనుభవించాలన్నా, సృష్టించాలన్నా మనిషికి ఒక ప్రత్యేక చిత్తవృత్తి అవసరం. నువ్వు నవ్వితే నీ చుట్టూ ఉన్నవారు నవ్వుతారు నీవు దుఃఖిస్తే నీతో పాటు ఎవ్వరూ దుఃఖించరు.

## ఖడ్గాలను మడిచిన గొడుగుల్లా పట్టుకునే వారు



బ్రిటిషువారి పరిపాలనా కాలంలో భారత దేశంలో జోధ్‌పూర్ (రాజస్థాన్) రాజ వంశానికి చెందిన యువరాజులు తమ ఖడ్గాలకు పట్టుబట్ట చుట్టి మడిచిన గొడుగుల్లాగ తీసుకువెళ్ళేవారు. 500 సంవత్సరాలకు పూర్వం రాజవంశానికి చెందిన యువరాజు వ్రేలు తెగింది కాబట్టి అంత జాగ్రత్తగా తీసుకువెళ్ళేవారు.

---

“ఆకలితో అలమటించే [illegible] దేవుడు ప్రత్యక్షమైతే అన్నం రూపంలోనే ప్రత్యక్షం కావాలి। మరోరూపంలో కాదు.”—గాంధీజీ

సంతోషాన్ని మాత్రమే అందరూ పంచు కుంటారు. హాస్యం సంతోషానికి, మనో వికాసానికి దోహదకారి.

జీవితంలో లేని హాస్యం సాహిత్యంలో కనిపించదు. మనిషి దైనందిన జీవితంలో హాస్యం ప్రవాహంలాంటిదైతే సాహిత్యంలో తరగలు కట్టే హాస్యం మెరుగులాంటిది. హాస్యానికి సన్నివేశం రంగస్థలం, కవిత పుట్టినిల్లు నాటకం మెట్టినిల్లు

హాస్యం సత్యాన్ని చెబుతుంది. ప్రకృతిలో సత్యాన్ని సుందరంగా చెబితే అది హాస్య కవిత. హాస్యం మెరుపులా మెరిసి చీకటి బ్రతుకులో దారిని చూపకపోతే అది అడవి గాసిన వెన్నెల. తేలికగా నవ్వించడం, తొలకరి జల్లులా నవ్వడం హాస్యానికి రెండు రెక్కలు.

హాస్య కవులు తక్కువగా ఉన్నప్పటికీ నవ్యాంధ్ర సాహిత్య వీధుల్లో హాస్యం సంస్కరణోద్యమంగా కొనసాగింది. ఆధునిక మానవులకు హాస్యం పూర్తిగా కరువై పోయింది. ఆధునిక మానవుడు విరామం లేని నిరంతర శ్రమ జీవి. అందుకే దొరికిన విరామ సమయాలలో సత్య దూరమైన సినీమా హాస్యంమీద మోజు పెంచుకున్నాడు.

• • •

పి. ఆదిలక్ష్మి, గుంటూరు.

ఉదయం నిద్రలేచింది మొదలు రాత్రి నిద్రపోయేవరకూ రోజువారి కార్యక్రమా లతో యాంత్రిక జీవితం నడిపే మానవునికి వేద దీర్చేది హాస్యం. మనస్సు చికాకుగా వున్నా, సమస్యలతో సతమత మవుతున్నా సున్నితమైన హాస్యం మనస్సుకు యెంతో ఆనందాన్నీ, ఆహ్లాదాన్నీ కలిగిస్తుంది. ఒక్కొక్కసారి మొరటు హాస్యంవల్ల ఎదుటి వారి హృదయం గాయపడే ప్రమాదం ఉంది. గాంధీ, తిలక్ వంటి మహానాయకు లెందరో స్వాతంత్ర్య పోరాటంలో బ్రిటిష్‌వారి అవక తవక పనులను కోపంతోకాక చతుర హాస్యో క్తులతో ఎత్తిచూపి వారికి బుద్ధి చెప్పిన సందర్భాలు ఎన్నో వున్నాయి.

మార్క్ ట్వెయిన్ హాస్యోక్తులు ప్రపంచ ప్రసిద్ధములు. తెనాలిరామలింగని పేరు వింటే నవ్వనివా రుండరు పానుగంటి వారి సాక్షిలో 'జంఘాలశాస్త్రి', గురుజాడ వారి 'కన్యాశుల్కం'లోని 'గిరీశం', మొక్కపాటివారి 'బారిష్టర్ పార్వతీశం', చిలకమర్తివారి 'గణపతి', మునిమాణిక్యం నరసింహారావు 'కాంతం' మొదలైన పాత్రలు తెలుగు సాహిత్యంలో ఎన్నటికీ మరపురాని హాస్యపాత్రలు.

అతి క్లిష్టమైన వేదాంత విషయాలను కూడా చక్కని ఛలోక్తులతో నవ్విస్తూ ప్రతీ వారికీ అర్థమయ్యేటట్లు వివరించ వచ్చు

## అమెరికాలో 740 లక్షలమంది నిరక్షరాస్యులు

మిక్కిలి అభివృద్ధి పొందిన అమెరికాలో 740 లక్షలమంది పూర్తిగా నిరక్షరాస్యులు, లేక ఏ కొద్దిపాటో చదివినవారు మాత్రమే.

('క్రిస్టియన్ సైన్స్ మానిటర్ సౌజన్యంతో')

"వైజం యొక్క యోగ్యత నవీనత కాదు విస్కాపట్యం." —థామస్ కార్లైల్

# అపూర్వ సర్పాలు

టి. ఎస్. ఎన్. మూర్తి

సాధారణంగా పశ్చిమ కనుమల్లో పర్వత ప్రదేశాల దగ్గర, కుళ్ళిపోయిన చెత్తా చెదారంలోను, రాతి బండల క్రింద అందమైన రకరకాల సర్పాలు ఉంటాయి. ఇవి విర పాయకరమైనవి. వీటిని గురించి చాలామందికి తెలియదు.



సుమారు ఒక అడుగు పొడవుగా వుండే ఈ సర్పాలకు తోక చివర ముళ్ళ తొడుగు ఉంటుంది. అందుచేతే వీటిని రఫ్ టెయిల్స్ (Rough tails) అంటారు. వీటి తల మొనదేరిన గునపంలా ఉంటుంది. మెత్తటి భూమిలో తలతో కన్నాలు త్రవ్వుకుని బొరియలలో నివసిస్తాయి ఈ సర్పాలు. వెలుగును అంతగా భరించలేవు. వీటికి ముళ్ళతోక సూచీ ఆకారపు తల ఈ మెత్తటి భూమిలో కన్నాలు తొలచుకోడానికి అనువుగా ఏర్పడి ఉండాలి.

దక్షిణ భారతదేశంలోనూ, శ్రీలంకాలోను ఇటువంటివి సుమారు 44 రకాల సర్పాలు కనిపిస్తాయి ఇవి కాటేయవు. విషసర్పాలు కావు. మిక్కిలి సాధువైనవి. చేత్తో పట్టుకుని లేవదీస్తే చేతి వ్రేళ్ళకు చుట్టుకుపోతాయి కాని కరవడానికి ఎంతమాత్రం ప్రయత్నించవు. ఇవి అనేక వింత వింత రంగులలో చూడటానికి ఎంతో అందంగా ఉంటాయి. నల్లటి నలుపు, ఎర్రటి ఎరుపు, నారింజ రంగు, పసుపు రంగులలో ఉంటాయి. చిన్న చిన్న పురుగులను, మట్టిపాములను, కుళ్ళిన ఆకులను తింటాయి. వీటిలో కొన్ని రకాలు గ్రుడ్లుపెట్టినా చాలామటుకు చిన్నచిన్న పాములను పెడతాయి. ●

## ప్రపంచ భాషలను వివరించే ఎన్‌సైక్లోపీడియా

యు ఎస్ ఎస్.ఆర్. సైన్సుల అకాడమీలో లిన్‌గ్విస్టిక్స్ ఇన్‌స్టిట్యూట్ ప్రపంచంలో ఇంతవరకు తెలిసిన 7,000 భాషల - వాటి చరిత్ర, మొదలైన వివరాలను తెలిపే సర్వస్వాన్ని సంకలనం చేయడానికి ప్రారంభించింది.

"నీవు నిట్ట నిలువుగా నుందుంటే నీ నీడ వంకరగా పడ్డా విచారించనక్కర్లేదు." -చైనా సామెత

# మరో ప్రపంచం

ప్రపంచంలో భూభాగపు సరిహద్దు ప్రాంతాలలో అంటార్కిటికా ఒకటి. భూమి చుట్టూ ఆవరింపబడి సముద్రం గడ్డకట్టుకు పోయిన ఆర్కిటిక్‌లా కాకుండా అట్లాంటిక్, పసిఫిక్, మరియు హిందూమహా సముద్రాలతో చుట్టబడివున్న పెద్ద ఖండమే అంటా



ర్కిటిక్ సుమారు భారతదేశానికి నాలుగున్నర రెట్లు పెద్దదిగా ఉండే అంటార్కిటికా పూర్తిగా దట్టమైన మంచుపొరతో కప్పబడి ఉంటుంది. ఈ పెద్ద ఖండంలో ప్రపంచంలో ఉండే సుప్రసిద్ధ పర్వతశ్రేణులు ఎన్నో ఉన్నాయి. ఈ పర్వత శిఖరాలన్నీ మంచుతో కప్పబడి ఉంటాయి.

అంటార్కిటికాలో వృక్ష సంపద శూన్యమనే చెప్పవచ్చు. కాని తీరప్రదేశాలు చిన్న చెట్లు, మొక్కలు, పెంగ్విన్ పక్షులు, సీలులు, తిమింగిలాలు, చేపలు మొదలైన వాటితో నిండి అచ్చట పేరు జిడ్డు జిడ్డుగా ఉంటుంది. అంటార్కిటికా వాతావరణం అతి శీతలం. ఒక్కొక్కప్పుడు విపరీత శీతలంగా ఉంటుంది.

అంటార్కిటికా సువిశాలమైన ఒక పెద్ద తెల్లని పీఠభూమిగా కనిపిస్తుంది. తీర ప్రదేశాలు, లోతట్టు పర్వత ప్రదేశాలు రమణీయంగా ఉంటాయి. ఇచ్చటి కొండలన్నీ సముద్రంలో నుంచి, మంచులో నుంచి పుట్టుకు వచ్చినట్టుంటాయి.

ఇచ్చటి ఎరెబస్ (Erebus) శిఖరం 4 కిలోమీటర్ల ఎత్తుగా వుండే అగ్నిపర్వతం. ఇది సదా ఎర్రటి కాంతిని ప్రసరిస్తూ ఉంటుంది. విస్తారంగా వీచే గాలివల్ల, లోపలి ఒత్తిడివల్ల ఇక్కడి మంచు పీలి, ఆకుపచ్చ రంగులలో ప్రకాశిస్తూ ఉంటుంది. అతి భయంకరమైన పెద్ద తుఫానులలో కూడా విపరీతమైన చలితో విశుద్ధమైన గంభీర వాతావరణం ఈ పీఠభూమికి సహజ సౌందర్యాన్ని చేకూరుస్తుంది. ●

---

## విద్యార్థులకు కంప్యూటర్ సహాయం

రష్యాలో విద్యార్థులు క్రొత్తగా రూపొందించబడిన కంప్యూటర్‌తో ప్రసంగించి గ్రాఫుల రూపంలో జవాబులను పొంద వచ్చు.

---

"కళను వృత్తిగా చేసుకునే వారందరూ చాలావరకూ మోసగాళ్ళే." —పాబ్లో పికాసో

(16 వ పేజీ తరువాయి)

ఊరిలోని గృహస్థులందరూ మనఃపూర్వకంగా భక్తిగౌరవాలతో వారి వారి శక్తికి తగినట్లుగా సమర్పణలను చేసేవారు. దానితో త్యాగరాజు నిత్యకృత్యము నిరాటంకముగా జరిగిపోయేది. పరమభక్తాగ్రేసరుడై విలసిల్లు త్యాగరాజు ప్రభావాన్ని విని మైసూరు మహారాజా, తంజా



వూరు మహారాజా మొదలగు ప్రభువులు త్యాగరాజుని తమ సభకు రప్పించగోరి ఆహ్వానాలు పంపారు. పొట్టకోసం నరాధములను కొలిచి ధనార్జన చేయడాన్ని త్యాగరాజు నిరసించాడు. ఒక్క శ్రీరాముని దయతప్ప ఇతరుల దయచే పని ఏమియు లేదని ఆహ్వానాలను నిరాకరించాడు తంజావూరు నేలే శరభోజి మహారాజు తిరువైయారుకు వచ్చి త్యాగరాజును తీసుకురమ్మని దూతలను పంపాడు. అప్పుడు త్యాగరాజు శ్రీరామరాజు సేవకంటే నరరాజు సేవ గొప్పదికాదు అని చెప్పి 'నిధి చాలా సుఖమా, కాపిచ్చునదే గొప్పాయనరా కలిలో మానవులకు విట్టి ఉపద్రవములకు నేనోర్వజాల రామా!' అని కీర్తనను చెప్పారు. రాజు నిరాశచెంది వెళ్ళిపోయారు.

సంగీతం, సాహిత్యం, జ్యోతిషం మొదలైన శాస్త్రాలలో త్యాగరాజు పాండిత్యాన్ని, అతడి రామభక్తి ప్రాశస్త్యాన్ని విని కంచి పీఠాధిపతి మరియు త్యాగరాజు తండ్రి స్నేహితుడు అయిన ఉపనిషద్బ్రహ్మేంద్ర స్వామి త్యాగరాజుని కంచికి రమ్మని ఆహ్వానించారు. త్యాగరాజు శిష్య పరంపరతో కంచికి బయలుదేరి దారిలో తిరుపతి, శ్రీరంగం, కంచి, తిరుత్తణి, కోవూరు మొదలైన అనేక దివ్యస్థలాలను దర్శించి అచ్చటి వేల్పులను సేవించి, కీర్తించి అనేక దివ్యానుభూతులను పొందాడు.

తిరుపతిలో శ్రీ త్యాగరాజు తిరుమలకు పోయి వేంకటేశ్వరస్వామి దర్శనంకోసం ఆలయానికి వెళ్ళినప్పుడు స్వామిదర్శనానికి కాలంకాదు కాబట్టి స్వామివారికి ఒక తెర అడ్డంగా ఉంది అక్కడివారు దర్శనానికి చాలా ఆలస్యం అవుతుందని చెప్పారు. అప్పుడు

## మిక్కిలి పెద్ద కృత్రిమ వజ్రం

టోకియో (జపాను) సుమ్మిటోమో ఎలక్ట్రిక్ ఇండస్ట్రీస్ వారు ప్రపంచంలోనే మిక్కిలి పెద్దదైన కృత్రిమ పారిశ్రామిక వజ్రాన్ని ఉత్పాదించారు. దీని బరువు 1.2 కారట్లు.

"మానవుడు మరణించవచ్చు, రాజ్యాలు ఏర్పడవచ్చు, నశించవచ్చు. కాని ఒక సద్భావం చిరస్థాయిగా ఉంటుంది. అవశ్వరమైనవి కావాలి." —జాన్ ఎఫ్. కెన్నడీ

త్యాగరాజు 'తెరతీయగరాదా, నాలోని తిరుపతి వేంకటరమణ మత్సరమను తెరతీయగరాదా' అంటూ 'అజ్ఞానం, అహంభావం, ఈర్ష్య, లోభం. మదం, మత్సరం మొదలైన నాలోని తెరలు నీ దర్శనానికి అడ్డుగా ఉన్నాయి. దయచేసి వీటిని తొలగింపు' అని భక్తి పారవశ్యంతో వేడుకున్నాడు. మహాభక్తుడు వచ్చాడని తెలుసుకుని అర్చకులు తెరను తీసివేశారు. వెంటనే ఇనుమడించిన భక్తితో, ఆనందంతో 'వేంకటేశుని సేవింప పదివేల కన్నులు కావలెనయ్యా' అని పరవశంతో పాడాడు పుత్తూరులో గ్రహచారవశంచేత ఒక బ్రాహ్మణుడు అచటనున్న నూతిలోపడి మరణించాడు. అతడి భార్యాబిడ్డలు ఆ ఘోర విపత్తుకి విలపిస్తూ ఉండగా విని త్యాగరాజు దయార్ద్ర హృదయంతో శవమున్నచోటికి వచ్చి బిలహరి రాగంలో శ్రీరాముని ప్రార్థిస్తూ,

'నా జీవాధారా, నా నోముఫలమా,
నా జూపు ప్రకాశమా, నా నాసికా పరిమళమా, నా జపవర్ణరూపమా
నా పూజా సుమమా త్యాగరాజనుత'

అని పాడిన వెంటనే గత జీవుడు పునర్జీవుడయ్యాడు.

తరువాత మద్రాసు దగ్గర కోవూరులో సుందరేశ మొదలియారు కోరికపై త్యాగరాజు కోవూరువెళ్ళి అచ్చట సుందరేశ్వరుని దర్శించి అనేక కీర్తనలను పాడాడు. ముఖ్యంగా 'ఈ వసుధ నీ వంటి దైవము. కోరి సేవింపరారే, శంభో మహాదేవ, నమ్మి వచ్చిన నన్ను, సుందరేశ్వరునిజూచి' అనే అయిదు కృతులు-కోవూరి పంచరత్న కీర్తనలు . చాలా ప్రసిద్ధిపొందాయి. ప్రతి సంవత్సరం తిరువయ్యారు త్యాగరాజు ఆరాధన సమయాలలో గోష్ఠిగానంగా వీటిని పాడుతూంటారు. ఇటువంటిదే ఈయన రచించిన నారద పంచరత్నాలు. తిరువత్తియూరు పంచరత్నాలు. నాగపుర పంచరత్నాలు, శ్రీరామ పంచరత్నం. వేంకటేశ పంచరత్నాలు. వీటిలోని సంగీత కల్పన, సంస్కృతాంధ్ర

---

## మహాసముద్రజలాల లోతులకు వెళ్లినవారు చాలా తక్కువ



భూమి మీదినుంచి ఆకాశంలోకి 200 కి మీ. ఎత్తుకి వెళ్ళినవారికంటే మహాసముద్రాలలో 5,000 మీటర్ల అట్టడుగు లోతులకు వెళ్ళినవారు చాలా తక్కువమందే.

—(సైన్స్ ఇన్ యు.ఎస్ ఎస్.ఆర్. సౌజన్యంతో)

---

"చర్చి గోపురాల కంటె దీపస్తంభాలు ఎంతో సహాయకరం." —బెంజిమిన్ ఫ్రాంక్లిన్

సాహిత్య నిర్మాణదక్షత త్యాగరాజును మహా వాగ్గేయకారకుడిగా చేసాయి వీటిలో మహా కావ్య సాంప్రదాయం ఇమిడి ఉంది. భాషశైలి జటిలంగా ఉంటుంది. అనేక సంగతులతో విస్తరించి విద్వాంసులు పాడ యోగ్యమైనవి. ఉత్సాహం భావోద్రేకాలను వెల్లివిరియించే అర్థ గాంభీర్యం, రసస్ఫురణ ఉంటుంది.

వాల్మీకి రామాయణంలో రచించిన 24,000 శ్లోకములవలె త్యాగరాజు 24,000 కీర్తనలు చెప్పినట్లు వాడుక. త్యాగరాజు సంకీర్తన సేవగా కృతులను పాడి, పాడిన కృతులను తిరిగి పాడకుండా సంవత్సరం అయేసరికి 3,600 కృతులను వ్రాసినట్లు సాంబమూర్తి గారు వ్రాసారు. ఇప్పటికి అచ్చయినవి 660 కీర్తనలు మాత్రమే త్యాగరాజు బమ్మెర పోతనామాత్యుని భాగవతమును పారాయణము చేయుచుండెడివాడు. అతడు పారాయణం చేసిన తెలుగు భాగవతం వ్రాత ప్రతి మధురలో సౌరాష్ట్ర సభలో భద్రపరచారు. పోతన పోకడలు కలిగి త్యాగరాజు భక్తి మార్గంలో ఆవేశాన్ని పొందాడు. ఇద్దరి జీవితాశయాలు ఒక్కటే. ఇద్దరూ శ్రీరామభక్తులే. ఉదర పోషణకై తమ కృతులను రాజులకూ, నరులకూ అమ్ముకోలేదు. దరిద్రమైనను మహా సంతోషంతో రామానుగ్రహమే పదివేలని గడిపిన ధన్య జీవులు. అచ్చయి లభిస్తున్న ఐదారు వందల కృతులలో త్యాగరాజు 200 రాగాలను ఉపయోగించాడు. వీరు రచించిన 72 మేళకర్త రాగ కీర్తనలలో సుమారు 40 మాత్రమే ప్రచారంలో ఉన్నాయి.

త్యాగరాజు సీతారామ విజయం, నౌకా చరిత్రము, ప్రహ్లాద భక్తి విజయం మొదలైన సంగీత నాటకాలను కూడా రచించాడు. ఈ నాటకాలన్నీ భక్తిప్రధానములు, తత్త్వ బోధకములు అయిన సంగీత నాటకాలు. నౌకా చరిత్రలో జీవులగు గోపికలు పరమాత్మ, పరమపురుషుడగు శ్రీమన్నారాయణుని పొందుటకు పడిన కష్టాలు మృదు మధురంగా భక్తి భావాలతో అతి సుందరగా వర్ణింపబడ్డాయి.

ప్రతివ సంవత్సరం పుష్య బహుళ పంచమి (జనవరి 6,1847) నాడు త్యాగరాజు సమాధి పొందాడు. తిరువయ్యూరులో త్యాగరాజు సమాధిపైన బెంగళూరు నాగరత్నంచే 1925 లో త్యాగరాజు ఆలయం కట్టింపబడింది. ఇచ్చట ప్రతి సంవత్సరం త్యాగరాజు ఆరాధన ఉత్సవాలు జరుగుతాయి. ఆరాధనకు అనేకమంది సంగీత విద్వాంసులు, భక్తులు వచ్చి చేరుతారు. ఈ త్యాగరాజ ఆరాధన ఉత్సవాలు జాతీయోత్సవాలలో ఒకటిగా వెలిశాయి. భాషలు వేరైనా, రాష్ట్రాలు వేరైనా ఆంధ్రులకూ, తమిళలకూ, కేరళీయులకూ, కర్ణాటకులకు అందరిదీ ఒకే సంస్కృతి అనీ, ఒకే సంగీతమనీ, ఒకే వేదాంతమనీ చాటిన నాదబ్రహ్మానందమూర్తి "త్యాగరాజు." ●

—తాదూరి

## పాల ఉత్పత్తి

అధికంగా పాలను ఉత్పాదించే దేశాలలో భారతదేశం మూడవ స్థానాన్ని ఆక్రమిస్తోంది. మన దేశంలో పాల ఉత్పత్తి సంవత్సరానికి 380 లక్షల టన్నులకు చేరుకుంది.

"ఒకర్ని ఒప్పించలేకపోయినా బోధించవచ్చు." —హెచ్. డబ్ల్యు. షా

# చమురు చరిత్ర

రాఘవేంద్రరావు

చమురు కలకాలం ఉండదు.( పర్షియన్ గల్ఫ్ దేశాలలో క్రీ. శ. 2000 నాటికి చమురుకి గొప్ప కరువు ఏర్పడుతుందని నిపుణులు అభిప్రాయపడుతున్నారు. అంతే కాదు - అప్పటికి ప్రపంచం అంతటా



భూమిలో డ్రిల్లింగ్

మోటారుకార్లు, ఇతర వాహనాలు పెట్రోలు, డీసెల్ మానెలకు బదులుగా ఆల్కహాలు, అడవులలో, వ్యవసాయ క్షేత్రాలలో కుళ్ళిన పెంటనుండి తయారయే ద్రవాల సహాయంతో నడపబడతాయని అంటున్నారు.

చమురు లేని ప్రపంచం అంటే భయోత్పాతంగా ఉంటుంది. భూమి ఏర్పడటానికి అనేక లక్షల సంవత్సరాలు పట్టింది. ఈ భూమి సహజ వనరులనుండి మానవుడు తీవ్ర ప్రయత్నాలతో సాధించిన చమురు ఇక 200 సంవత్సరాలు కూడా రాదేమో అని భయపడుతున్నారు.

రాబోయే చరిత్రకారులు ఈ 20 వ శతాబ్దాన్ని తైల యుగంగా విభజిస్తారంటే ఎంత మాత్రం సందేహంలేదు. ప్రపంచంలో అమెరికాలో ఎక్కడో ఒక మూల 1859 సం లో చమురు కనుగొనబడ్డా తొలిసారిగా



సముద్రగర్భంలో డ్రిల్లింగ్

B. C. 481-424 ప్రాంతంలో 'హిరోడోటస్' (Herodotus) కాలంలో పెట్రోలు త్రవ్వబడినట్టు చరిత్ర రికార్డులు తెలియజేస్తున్నాయి. ఈ సుప్రసిద్ధ గ్రీకు చరిత్రకారుడు పెట్రోలునుంచి బిట్యుమన్ (తారు),

"కరువు, దారిద్ర్యం, అసమానతలమధ్య
ఏ ప్రజాస్వామ్యము దీర్ఘకాలం ఉండదు."

-జవహర్ లాల్ నెహ్రూ

ఇతర తేలిక చమురులు ఉత్పత్తిచేసే విధానాన్ని వివరించాడు. చైనాలో B. C. 221 సం. లో పెట్రోలుకోసం నూతులు త్రవ్వినట్లు వ్రాయబడింది. రోము పండితుడు



ఎడ్విన్ డ్రేక్

(A. D. 23-79) ప్లినీ ప్రకారం జ్యూపిటర్ (గురు) దేవాలయంలో దీపాలు వెలిగించడానికి సిసిలీ దగ్గర అగ్రిజెన్‌టమ్‌లో లభించిన పెట్రోలియమ్ ఆయిల్ ఉపయోగించినట్లు తెలుస్తుంది. క్రీస్తుశకం ప్రారంభంలో గ్రీకులు, రోమనులు, శరసెన్స్ యుద్ధాలలో పెట్రోలు బాంబులను ఉపయోగించినట్లు ఆధారాలు ఉన్నాయి.

ప్రపంచాన్ని చుట్టివచ్చిన మార్కోపోలో (1254-1324) కాస్పియన్ సముద్రానికి దగ్గరలో బాకూవద్ద చమురు ఊటలను చూసినట్లు, ఆ నూనె వంటకు పనికిరాదు కాని దీపాలు పెట్టుకోడానికి, ఒంటెలకు పట్టే పేల నివారణకు ఉపయోగపడుతుంది అని వ్రాసాడు. 1786 వ సంవత్సర ప్రాంతంలో బర్మా మరియు భారతదేశం కొన్ని భాగాలకు ఇరవాడి నదీప్రాయ 'ఎనాంగ్‌యంగ్' చుట్టు ప్రక్కల నూతులనుండి త్రవ్విన పెట్రోలు చమురు దీపాలకు సరఫరా చేయబడింది. 18 వ శతాబ్దంలో పెట్రోలు ఎక్కువగా ఔషధ ప్రక్రియలకు ఉపయోగపడింది అంటే ఆశ్చర్యకరంగా ఉంటుంది!

సుమారు 1800 ప్రాంతంలో అమెరికా న్యూయార్క్‌లో సెనకాసరస్సు సమీపంలో చమురు కనుగొనబడింది ఇది అధికంగా ఔషధాలకు 'సెనకా ఆయిల్'గా సీసాలలో అమ్మేవారు. ఔషధాలకు వినియోగింపబడే ఈ అమెరికన్ నూనె 1829 సం.లో అమెరికా, కెంటకీ, బర్కెస్‌విల్లీలలో విస్తారంగా వాడేవారు.

దీనికి 15 సంవత్సరాలముందే డ్రోహో బైసెల్ (పోలెండ్) ప్రేగ్ (జెకొస్లొవేకియా) ప్రదేశాలలో గాలీసియానుండి వచ్చే పెట్రోలియమ్ ఆయిల్‌ను ఉపయోగించి దీపాలను వెలిగించుకున్నారు.

తరువాతే ప్రపంచంలో పెట్రోలు చరిత్ర పూర్తిగా మారింది. 30 సం.రాల వయస్సుగల రైల్వేగార్డు ఎడ్విన్ డ్రేక్ అనే యువ

## కువైట్‌లో అధికశాతం వీడియో స్వంతదారులు

నూనె సౌభాగ్యంతో తులతూగే గల్ఫ్ రాజ్యాలకు చెందిన కువైట్‌లో శమారమి 92 శాతం వీడియో కాసెట్ రికార్డర్స్ (VCR) స్వంతదారులే. ఇది ప్రపంచంలో అత్యధికం.

"శాంతితో కూడిన అన్యాయం అనుభవించడం కంటే ధర్మరక్షణకు యుద్ధం చేయడం మేలు." —ఛార్లెస్ పెగుజె

కుడు భూమినుంచి నూనెను లభింపజేయడానికి నూతులను త్రవ్వడానికి బదులుగా భూమిలో డ్రిల్లింగ్ ప్రారంభించారు.



జాన్ డి. రాక్ ఫెల్లర్

స్థానికులు ఆ ప్రయత్నాలను 'డ్రేక్స్ ఫాలీ' అని పిలిచేవారు. ఆగస్టు 27, 1859 న భూమినుండి ఒక్కసారిగా నూనె పైకి తన్నుకు వచ్చింది. డ్రేక్ ప్రపంచంలో తొలి నూనె బావికి స్వంతదారుడయ్యాడు.

పిట్స్‌బర్గ్ (పెన్సిల్వేనియా)కి 120 కి.మీ. దూరంలో టిటుస్‌విల్లీ (Titusville) నుంచి రోజుకి 600 డాలర్లు (రూ. 7,800) విలువచేసే 30 బారల్‌ల నూనె లభించేది. మరి కొంతకాలానికి డ్రేక్ గొప్ప ధనికుడయాడు. కాని నూనె వ్యాపారంలో అయిల్ బ్రోకరుగాను, జూదాలు ఆడి, అనేక ఇతర వ్యసనాలకులోనై చివరకు 1880 సం. లో గర్భదరిద్రుడుగా మరణించాడు.

1863 వ సం.లో అమెరికా 'ఆయిల్ మాగ్నెట్' అనే జాన్. డి. రాక్‌ఫెల్లర్ ముడినూనెను కిరసనాయిలుగా తయారు చేయడం సాధించాడు. అంతకు పూర్వం పెట్రోలును నిరుపయోగకరంగా పారబోసేవారు. పది సంవత్సరాల కాలంలో రాక్ ఫెల్లర్ 'స్టాండర్డు ఆయిల్' ప్రపంచ ప్రఖ్యాతిని పొంది నూనె మార్కెట్టును నియంత్రించ గలిగింది.

భారతదేశంలో చమురు చరిత్ర సుమారు 100 సంవత్సరాల క్రితమే ప్రారంభమయింది. 1882 సం.లో అస్సాం రైల్వే అండ్ ట్రేడింగ్ కంపెనీ లిమిటెడ్‌వారు డిబ్రుగర్‌నుండి మార్గెరిటా వరకు రైలు మార్గాన్ని వేసారు. ఏనుగుల సహాయంతో అప్పటి అడవులను శుభ్రం చేసారు. ఈ ఏనుగుల పాదాలకు చిక్కటి నూనెవంటి పదార్థం అంటి ఉండడం చూచి బ్రిటిషు ఇంజనీర్లు ఆ నూనె ప్రదేశాన్ని కనిపెట్టి కొంతమంది స్థానికులకు 'డిగ్, బాయ్ డిగ్' అని చెప్పారు అస్సాంలో నేటికీ ఆ ప్రదేశానికి ఆ పేరే స్థిరపడిపోయింది.

నేటికీ ఇక్కడ 1890 సం నుండి 1930 సం. వరకు నూనెను ఇచ్చిన తొలిబావిని చూడవచ్చు. 1932 సం.లో నిర్మింపబడిన డిగ్బాయ్ నూనెశుద్ధి కర్మాగారం (Oil Refinery) ఆసియాలో మొట్టమొదటిది కాదు. కాని ఇది ప్రపంచంలో నేటికీ నూనెను లభింపజేస్తున్న ప్రాచీన నూనెశుద్ధి కర్మాగారం. నేడు భారతదేశంలో 12 నూనె శుద్ధి కర్మాగారాలు ఉన్నాయి. ఇవన్నీ

"మనమున నాటిన మాటలు వినుమెన్ని
యుపాయములను వెడలునె." —భారతం

మొత్తంమీద 400 లక్షల టన్నుల పైబడి పెట్రోలు పదార్థాలను ఉత్పత్తి చేస్తున్నాయి.

నేడు ప్రపంచమంతటా 7.17.000 నూనె బావులు ఉన్నాయి. మొదట రోజుకి తీయబడే 30 బ్యారెల్‌ల నూనె నేడు 630 లక్షల బ్యారల్‌లకు పెరిగింది. 1983 సంవత్సరాంతానికి ప్రపంచంలో నూనె విలువ 698 బిలియన్ బారలు ఉండగలదని అంచనా వేసారు. ఈనాడు అంతర్జాతీయ నూనె రంగం ఒక పెద్ద ముఖ్య రంగం ●

## అంగవైకల్యాం ప్రతిబంధకం కాదు




ప్రపంచంలో అంగవైకల్యులైన అభాగ్యులు ఎందరో ఉన్నారు. కాని ఏ కొందరో ధైర్యంతో దృఢనిశ్చయంతో ఉద్యమించి విజయవంతులవుతారు. వారు ఒక ప్రత్యేక వర్గానికి చెందిన వ్యక్తులు-అశక్తత వల్లకాదు, వారు సాధించదలచుకున్న లక్ష్యాన్ని మరింత ఎక్కువ పట్టుదలతో ప్రయత్నించి సాధిస్తారు కాబట్టే కొంతమంది మహాద్భుతంగా విభాయిస్తారు. చిన్ననాటి నుంచి చెవులు వినిపించని, కళ్ళు కనిపించని హెలెన్ కెల్లెర్ ప్రపంచ ప్రఖ్యాతి పొందిన రచయిత్రి, వాక్చాతుర్యం కలది. అంధుడైన బినోద్ బెహారీ ముఖర్జీ గొప్ప చిత్రకారుడు. అనేక అద్భుత చిత్రాలను చిత్రిస్తూ ఇతర చిత్రకారులకు మార్గదర్శకుడుగా పేరుపొందాడు. ఫ్రాంక్‌లిన్ రూజ్‌వెల్ట్ పోలియో వ్యాధితో అవిటివాడైనప్పటికీ జీవితంలో అపజయాన్ని పొందలేదు. అమెరికా అధ్యక్షపదవిని అధిష్ఠించాడు. కళ్ళుసరిగా కనిపించని డా. జాకీర్ హూస్సేన్ భారతదేశపు అధ్యక్షుడు. గొప్ప కవి, రచయిత అగు పి. లాల్‌కు కూడా కళ్ళు సరిగా కనిపించవు. ఎవరెస్ట్ శిఖరాన్ని అధిరోహించిన హెచ్. పి. ఎస్. అహ్లూవాలియా నడవలేడు. చక్రాల కుర్చీలో సంచరిస్తూ ఎంతో ఓపికతో గ్రంథాలను రచిస్తూ పర్వతారోహణకు ఆసక్తిని, అభిలాషను పెంపొందిస్తున్నాడు.

పోలియోవ్యాధితో ఒకచేయి దెబ్బతిన్న గొప్ప క్రికెట్ క్రీడాకారుడు చంద్రశేఖర్ స్పిన్ బౌలర్‌గా ప్రపంచ ప్రఖ్యాతిని పొందాడు. అంధుడైన వేద్ మెహతా రచించే గ్రంథాలు మిక్కిలి వేగంగా అధికంగా అమ్ముడుపోతాయి.

ఇంకా ఎందరెందరో సుప్రసిద్ధులు కాకపోయినా ధైర్యంతో, అదృష్టంతో జీవితంలో దిగ్విజయాన్ని పొందగలుగుతున్నారు.

(Unicef ఫీచర్స్ సౌజన్యంతో)

"అంకిలెరిగి మాటలాడ నేర్చినప్పుడు పిన్న పెద్దతనము లెన్న నేల!" — వేమన

# మీరు-మీదస్తూరి

ఒకప్పుడు దస్తూరీ ఒక కళగా భావింపబడేది. ఈనాడు దీన్ని ఎవ్వరూ లక్ష్యం చేయడం లేదు. వ్యాపార రంగంలోను, వ్యాపార వ్యవహారాలలోనూ దస్తూరీ పఠనానుకూలంగా లేకపోవడంవల్ల (legible) ఏటా రమారమి రూ. 3,500 లక్షలు నష్టం ఏర్పడుతూందని అంచనా.

*writing is thick heavy*

*writing is dirty smeary*

అధికశాతం దరఖాస్తు పత్రాలు పఠనానుకూలంగా లేకపోవడం యజమానులు గమనించారు. మందులను విక్రయించే ఫార్మసిస్టులు రోగులకు డాక్టర్లు ఇచ్చిన మందు చీటీలను చదవలేకుండా ఉన్నారు.

వైద్యసంబంధమైన పత్రికలు, జర్నల్స్- డాక్టర్ల దస్తూరీ గురించి మిక్కిలి పరితాపాన్ని వెలిబుచ్చారు. ఫార్మసిస్టులు డాక్టర్ల వ్రాత తెలియక సరైన మందులు ఇవ్వకపోతే ఒక్కొక్కప్పుడు ఎంతో అపాయకరంగాను, విషాదాంతంగాను పరిస్థితులు పరిణమిస్తాయి.

ప్రతి సంవత్సరం పదిలక్షల జాబులు పార్సిళ్ళు పై విలాసాలు సరిగ్గా తెలియక పోవడంవల్ల రిటర్న్ లెటర్ ఆఫీసుకు చేరిపోతున్నాయి. ఒకప్పుడు దస్తూరీ మెరుగుపరచుకునేందుకు పాటిస్తున్న పద్ధతులన్నీ ఈ నాడు పాఠశాలలలో నిర్లక్ష్యం చేయబడుతున్నాయి. దస్తూరికి తగిన శ్రద్ధ జాగరూకత పాటింపబడటంలేదు. పాఠశాలలో మొదట అచ్చు అక్షరాలలో విడివిడిగా వ్రాయడం అలవాటు చేయిస్తారు. కొంతకాలం అయ్యేటప్పటికి గొలుసుకట్టుగా కలిపి వ్రాతను ప్రారంభిస్తారు. విద్యార్థులు ఎంతో కష్టపడతారు. మార్పుకు అసలు ప్రయత్నించరు.

మంచి దస్తూరీ అలవాటు చేసుకోకపోవడానికి మరో ముఖ్యకారణం టైప్‌రైటింగ్ మెషీనులు అధికంగా వాడుకలోకి రావడం. రెండవది పరీక్షా పత్రాలలో వ్రాయదగిన వ్యాసాలు లేకపోవడం. ప్రశ్నా పత్రాన్ని చూసి జవాబుల పుస్తకంలో '×' గుర్తును గాని, 'టిక్' గుర్తునుగాని ఉంచాలి. అసలు వ్రాతపని చాలా తక్కువ

మీరు జీవితంలో దిగ్విజయాన్ని సాధించాలంటే, వ్యక్తిగతంగా ప్రత్యేకతను పొందాలంటే మీరు మీ దస్తూరీకి ప్రాధాన్యతను ఇవ్వాలి. వ్రాసేవారికీ, చదివేవారికీ కూడా దస్తూరీ ఆనందాన్ని కలిగించేటట్టు ఉండడం గొప్ప విషయం. మాటలకూ, ఆలోచనలకూ ప్రసంగం ఎంత ఆహ్లాదకరమైన సాధనమో దసూరీ కూడా అంతసొగసైన పరికరం.

"మహాత్ము లెప్పుడూ అవకాశం లేదని చెప్పుకోరు." —రాల్ఫ్ వాల్డో ఎమర్సన్

# తొట్టెల్లో కూరల పెంపక(ం)

మంగళ్ చరణ్ సాహు

పూలకుండీలలో గాని, ఇంటి వెనుక పెరట్లో గాని ఏ రోజు కారోజు వంటకు ఉపయోగపడే కూరమొక్కల పెంపకమే పూలతొట్టెల్లో కూరల పెంపకం ఒరిస్సా ప్రజలు ఎలా లేదన్నా 50 రకాలకు పైబడిన ఆకుకూరలను వాడతారు. వీటిలో బ్రహ్మాండమైన చేదు కూరలు కూడా ఉన్నాయి.



బఠాణీకూర

సాధారణంగా పూలతొట్టెల్లో వీరు పెంచే కూరల్లో ముఖ్యమైనది బచ్చలి దీని ఆకులు ఉడకబెట్టి రకరకాల కూరలు, పులుసులు చేసుకుంటారు. వాటర్ చెస్ట్‌నట్ అనే ఒక రకం నీటిమొక్క ఆకులను కూడా విస్తారంగా వాడతారు. కొత్తిమిరితో రుచికరంగా ఎన్నెన్నో రకాల పచ్చళ్ళు తయారుచేస్తారు. కాలిఫ్లవరు ఆకులు, ముల్లంగి ఆకులు, దోస ఆకులు, బఠాణీ ఆకులు, మెంతికూర, కామంచి కూర మొదలైనవాటిని అన్నిటినీ ఉపయోగిస్తారు. ముఖ్యంగా వేపచిగుళ్ళు కాకర ఆకులు, జనుప ఆకులు వీరు ఉపయోగించే చేదుకూరలు.

ఒరిస్సాలో సామాన్యులే కాదు భాగ్యవంతులు కూడా ప్రతిరోజూ ఏదో ఒక ఆకు కూర తప్పనిసరిగా ఆవనూనెతో వండుకుని తింటారు. ఇది వారి సాంప్రదాయం. పచ్చి



ముల్లంగి ఆకులు

ఆకుకూరలతో రుచికరమైన ఆదరవులు చేసుకోడం చాలా సులభం.

(మిగతా 58 వ పేజీలో)

"పరిపూర్ణతలో గల ఒకే ఒక లోపం - విసుగు." —డబ్ల్యు సామర్ సెట్ మామ్

# విజ్ఞాన వేదిక

ఆస్ట్రోబయాలజీ: భూమి కాకుండా ఇతర ఖగోళ గ్రహాలలో నివసించే జీవరాశులను గురించిన అధ్యయనం.

• • •

కాప్స్యూల్: అంతరాళంలో ప్రయాణీకుల ప్రాణాన్ని నిలబెట్టేందుకు ప్రత్యేక అంతరవాతావరణంతోను, ఒత్తిడితోను నింపి సీలు చేయబడిన కేబిన్.

• • •

ఎర్త్‌షైన్: (భూకాంతి) చంద్రునిపై పరివర్తనం చెందిన భూమియొక్క ప్రకాశం. అమావాశ్యనాడు చంద్రుని చీకటిగా ఉండే భాగానికి వెలుగును కలిగిస్తుంది.

• • •

మైక్రో మీటియార్స్: అంతరాళంనుంచి భూమిలోకి జారిపడే అతిసూక్ష్మమైనఉల్కలు.

• • •

ఫొటోస్ఫియర్: సర్వ సాధారణంగా మానవులు భూమినుండి చూడగల సూర్యుని తలము.

• • •

రేడియో టెలిస్కోపు: మిక్కిలి పెద్ద ఏరియల్స్‌తో నిస్తంత్రీ గ్రాహకము.

• • •

వేన్స్: పౌర్ణమినాటి నుండి అమావాస్య వరకు చంద్రుని క్షయంలో మార్పులు.

• • •

స్పేస్ మెడిసిన్: అంతరాళంలో పయనించే మానవ ప్రయాణీకులను గురించిన ప్రత్యేకఅధ్యయనానికి వీలుపడే వైద్యవిజ్ఞానం.

• • •

ట్వింక్లింగ్: దృశ్యమాన పరిస్థితులను బట్టి నక్షత్రాల కాంతిలోను, రంగులోను కలిగే శీఘ్రగతి మార్పులు.

• • •

వాక్సెస్: అమావాస్య నుండి పౌర్ణమి వరకూ చంద్రుని వృద్ధిలో మార్పులు. ●

---

(57 వ పేజీ తరువాయి)

దీనికి కావలసిన సామానులు—

200 గ్రా లు. ఆకుకూర
2 చెంచాల ఆవనూనె
ఒక నీరుల్లిపాయ
1 లేక 2 వెల్లుల్లిపాయలు
చిటికెడు ఉప్పు

ఆకుకూరలవల్ల శరీరాభివృద్ధికి అవసరమైన ప్రోటీనులు, క్రొవ్వుపదార్థాలు, కార్బోహైడ్రేటులు, నీరు, ఇనుము పుష్కలంగా లభిస్తాయి ఇవన్నీ మానవుల ఆహారంలో ఆరోగ్యాభివృద్ధికి తప్పనిసరిగా ఉండితీరవలసిన పదార్థాలు. కాయగూరల ధరలు ఆకాశాన్ని అంటుతూన్న ఈ రోజుల్లో చౌకగా లభించే ఆకుకూరలు విరివిగా వాడుతూ అందరూ ఆరోగ్యాన్ని కాపాడుకోవచ్చు.

---

"మాతృదేశాభిమానం లేని మానవుడు లోకాన్ని ప్రేమించలేడు."—విలియం రాల్ఫ్ ఇంగ్

# పోటీలు

(ఆగస్టు 1985)

'విస్డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొన వచ్చు. ఏ ఎంట్రీ కా ఎంట్రీ విడిగా పావు తావు సైజుకు తగ్గని కాగితం మీద వ్రాయాలి ప్రతి ఎంట్రీ మీదా అడ్రస్సు ఉండాలి. ఒకే కాగితం మీద ఒకటి కంటె ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించబడవు. సరియైన, లేదా మేలైన ఎంట్రీలు చాలా ఉంటే లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రూ. 10 లు. రూ. 7 లు, రూ. 5 లు ఖరీదుచేసే పుస్తకాలు బహుమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీ కూపన్' (ఒక ఎంట్రీకి చాలు) అంటించి పంపాలి. ఒక కూపన్‌తో ఒకేసారి ఎన్ని ఎంట్రీ లయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరుతేదీ. ఆగస్టు 20, 1985. పంపవలసిన చిరునామా: పోటీల నిర్వాహకుడు, తెలుగు "విస్డమ్", 9, దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు 600 004.

-సంపాదకుడు.

## వ్యాసం

"తెలుగు పత్రికలలో నేటి కథా సాహిత్యం" అనే అంశం మీద 300 మాటలకు మించకుండా వ్యాసం వ్రాసి పంపండి.

## క్విజ్

1. రాజ్యసభలో సభ్యుని కాలపరిమితి ఎంత? 2. భారతదేశం ఎన్ని దేశాలతో

## ముఖచిత్రవ్యాఖ్య

(జూన్ 1985)

"దాచినా దాగని చిరునవ్వు
విజ్ఞాన జలధిలో తొలి పువ్వు."

—జి. జానకిరామ్, విజయవాడ.

* * *

'విస్డమ్'పై నీ నవ్వు
వికసించిన ఓ పువ్వు

—ఫణీంద్ర, తుంగభద్రాడామ్, (కర్ణాటక).

* * *

విరబోసుకున్న చందం
'విస్డమ్' కది ఆనందం.

—పదాల శివశంకరమూలారెడ్డి విజయవాడ.

"అహితుల నెల్ల విధముల విహితులుగా జేయునది వివేకము."



ఉమ్మడి సరిహద్దులను కలిగి ఉంది? 3. భారతదేశపు అధ్యక్షుని ప్రమాణ స్వీకారం ఎవరు చేయిస్తారు? 4. ఎమ్ ఎస్ సుబ్బులక్ష్మి ఎవరు? 5 శ్రీ జి. పార్థసారధి ఈ క్రింది వాటిలో దేనికి ప్రసిద్ధిపొందాడు? (ఎ) రాజ్య తంత్ర్యము, (బి) వ్యవసాయం, (సి) అంత రిక్ష విజ్ఞానం, (డి) విద్య, 6. క్రికెట్ పందెంలో డాన్ బ్రాడ్ మెన్ ఎన్ని సెంచురీలు గెలుచుకున్నాడు? 7. ఏ ఆటలో సంతోష్ ట్రోఫీని గెలుచుకుంటారు? 8. ఏ పంటకు నల్లరేగడి భూమి అనువుగా ఉంటుంది?

# పజిల్

ఆధారాలు-అడ్డం: 3 పర్ణమూలము, 6. పెండ్లిపిలుపు, 7. సంతోషము పొంగి పొరలు, 8. గంభీర సాగరము, 10. పుష్పాదులు కొప్పులో ముడుచు, 11. 'ప్రభవ' మొదలగు వానిలో ఒక సంవత్సరం, 12. విఘ్నేశ్వరుడు, 14. పరిమితి చేయ శక్యము కానిది, 16. బ్రాహ్మణులు, క్షత్రియులు మొదలగు వర్ణము, 18. నిలువులో 17 నకు చెదిరిన "తెలియదుగా" అను అర్థమిచ్చు పదము చేరినది (సూచన: —ఎ—రుగా — —)

నిలువు: 1. కవి వరులకు తెలియును, 2. ఆకాశము, 3. 'సముద్రము అననా' అను మాట చెదిరినది, 4. తెల్లకలువ, 5. రాక్షస రాజు, 9. తురక నవాబు, 12. ఆకాశము



నుండి పారెడి నది, 13. ధ్వని అనుకరణ విశేషము, 15. తమరు, 17. లక్ష్మీదేవి.

# తెలివికి పరీక్ష

1. స్త్రీలకంటే పురుషులు ఎక్కువ నిజాయితీ పరులు, నిజమా / అబద్ధమా?

2. మన సాధారణ కంటికి ఎన్నడూ కనిపించని గ్రహం ఏది?

బుధుడు (ఎ), శుక్రుడు (బి), కుజుడు (సి), నెప్ట్యూన్ (డి).

3. 'భద్రాచల రామదాసు' అని పేరుపొంది పరమ భక్తాగ్రేసరులలో ఒకడుగా గణుతికెక్కిన వాగ్గేయకారకుని అసలు పేరు ఏది?

4 ఒక మందు ప్రభావంతో మాస పత్రికలు, వారపత్రికలు, విజ్ఞాన సర్వస్వాలు మొదలైనవి ప్రచురించి ఆంధ్రదేశాన్ని విజ్ఞా

నంలో ముంచి ఎత్తినది ఏది? ఆ మందేది?

5. రాయవెల్లూరు జెయిలులో ఉద్భ వించిన తెలుగువారి మొదటి స్వతంత్ర నవల ఏది? దానిని వ్రాసిన వారెవరు?

6. మొదటి పంచవర్ష ప్రణాళిక ప్రారం భింపబడిన సంవత్సరం ఏది?

1948 (ఎ), 1949 (బి), 1950 (సి), 1951 (డి).

7. దేనివల్ల అత్యధిక శక్తి వినియోగ మవుతుంది?

గుఱ్ఱపుస్వారీ (ఎ), నీటిలో ఈదుట (బి), పరుగెత్తుట (సి), నడచుట (డి)

8. అనువంశికను ప్రతిపాదించినది ఎవరు?

హార్వేవిలియం (ఎ), హెర్డ్జ్ హెన్‌రిచ్ (బి). మెండెల్‌గ్రెగరీ (సి) ఫ్లెమింగ్ అలెగ్జాండరు (డి).

## మాటల మహిమ

ఈ క్రింది మాటలకు సరియైన అర్థాన్ని / అర్థాలను గుర్తించండి.

1. అదను: ఆకలిగొనినవాడు (ఏ), కాలము(బి) అధికము(సి), సమయము(డి).

2 అనూనము: వెలితిలేనిది (ఎ), అవి వాహితుడు (బి), పూర్ణము (సి), శీలము(డి).

3. ఆమిషము: మాంసము (ఎ), లంచము (బి), ప్రస్తావన (సి), ఉత్సాహము (డి).

4. ఉదగ్రము: కొట్టకొనది (ఎ), పొడ వైనది (బి), చిట్టచివరిది (సి), భయంకర మైనది (డి).

5. తాళముపట్టు: పట్టుదలతో కార్యము సాధించు (ఎ), యాజమాన్యము వహించు (బి), మంచిపట్టు (సి), తాళ విశేషము (డి).

6. నుడికారము: ఒక రకము ఉప్పు (ఎ), అధికారము (బి) మాటయందలి చమ త్కారము (సి), తక్కువ కారముగలది (డి).

# విసదమ్
## పోటీల కూపను
### అగస్టు 1985

## పాఠకుల అభిప్రాయాలు

(జూన్ 1985)

"మతాన్ని ప్రేమిస్తే ఏమొస్తుంది?
మనుషులను ప్రేమించి, మమతను పెంచి
గౌరవించాలి!"

—వి. చక్రధర్, కనిగిరి, (ప్రకాశం జిల్లా)

* * *

"రక్షణ కోసం బాంబులు తయారు
చేస్తున్నారు ఒకవైపు,
భక్షణ కోసం బాంబులు పేలుస్తున్నారు
మరోవైపు"

—గడ్డం భీమ్‌రెడ్డి, కుమారి పోస్టు.

* * *

"లేదు లేదు అనడంకన్న
ఉన్నదానితో తృప్తి నొందడం మిన్న"

—సంధ్యాదేవి, విశాఖపట్టణం.

"దురదృష్టాలే అదృష్టాన్ని తెలియజేస్తాయి." —థామస్ ఫుల్లర్



**విస్డమ్**
**పోటీల కూపను**
**ఆగస్టు 1985**

7. కోపు: అందము (ఎ), నాట్యము(బి), సమయము (పి). క్రొవ్వు (డి).

8. పలితము: చిగురు (ఎ). చిగిర్చిన కొమ్మ (బి), నెరపిన తల వెంట్రుక (పి), ఖరద

## ముఖచిత్రవ్యాఖ్య

ఆరు మాటలకు మించకుండా ఈ సంచిక ముఖచిత్రానికి తగిన శీర్షిక వ్రాసి పంపండి.

## పాఠకుల అభిప్రాయాలు

దైనందిన జీవితంలో మీకు ఎదురయ్యే ఏ సంఘటనను గురించి అయినా ఒకటి రెండు వాక్యాల్లో చమత్కారమైన వ్యాఖ్య వ్రాసి పంపండి. ఉత్తమ వ్యాఖ్యకు రు. 5 ల ఖరీదు చేసే పుస్తకం బహుమతి.

## మీరైతే...?

"శరీరాంగాల విక్రయం వ్యాపారంగా పరిణమిస్తే" .... మీరైతే ఏం చేస్తారు? క్లుప్తంగా, చమత్కారంగా ఉండే జవాబు వ్రాయండి.

## భావపరిచయ పోటీ





8 మాటలకు మించకుండా పైన కనిపిస్తున్న రెండు చిత్రాలనూ పరిశీలించి చమత్కారమైన, లేదా ఆలోచన రేకెత్తించే శీర్షికను సూచించండి.

"మనను మనం తెలిసికో గలిగినప్పుడు
ఇతరులను అర్థం చేసుకోవచ్చు."
— హెరిక్ హాఫర్

# పోటీలు (ఫలితాలు)

(జూన్ 1985)

వ్యాసం: విజేతలు: మొదటి బహుమతి: ఎస్. రాజేశ్వరి. శ్రీశైలం ప్రాజెక్టు, (కర్నూలు జిల్లా): రెండవ బహుమతి: వి. ఎమ్ సుధాకర రెడ్డి, ప్రొద్దుటూరు, (కడపజిల్లా): మూడవ బహుమతి. ఏ జోయా కుమారి, ఉయ్యూరు, (కృష్ణాజిల్లా).

క్విజ్—జవాబులు: 1. 1885 (సి), 2. కేరళ (బి). 3. ఆర్. కె. త్రివేది, 4. కథకళి (ఎ), 5. శంకరంబాడి సుందరాచారి, 6. సోఫియా వాడియా-ఇండియన్ పెన్, 7. జాన్. బి హిగ్గిన్స్. 8. కర్ణాటక (డి).

విజేతలు: మూడవ బహుమతి. టి.ఎస్. వనజాక్షి, అనంతపురం.

పజిల్ జవాబులు - అడ్డం: 1. పాలవాగు, 3. అప్పటము, 5. సన్నుతి, 6. జాతినాగు, 7. ఓర్తు, 8. సన్మానము, 10. పద్యములు, 12. దిటవొ, 13. పాత, 14. రగులుకొనుట, 16. ఆదే. 17. ములుతారు, 18. ముచ్చలుట.

నిలువు: 1. పారిజాతాపహరణము, 2. గుసగుసలు, 3. అతిదాన, 4. ముమ్మొర్తులు వొగడే. 9. ముదిత, 11. ముగ్గులు. 13. పాటలము, 15. కొసరు, 16 ఆటలు.

విజేతలు: మూడవబహుమతి: బి. జానకీ దేవి, హైద్రాబాద్.

తెలివికి పరీక్ష: జవాబులు: 1. విగ్రహము (డి), 2. రుచి (ఎ) సుఖం (బి) పిల్లను, కులం (సి), 3. 49, (ఈ శ్రేణిలో సంఖ్యల తేడాలు 5,7,9,11 మరియు 13 ను ప్రతి సంఖ్యకు కలిపితే తరువాతి సంఖ్య వస్తుంది.) 4. 67. (బ్రాకెట్లకు ఎడమవైపు సంఖ్యలో అంకెలను, కుడివేపు సంఖ్యలో అంకెలను విడివిడిగా గుణించి మొత్తాలను కలపాలి $(5 \times 8) = 40$, $(9 \times 3) = 27$: $40 + 27 = 67$, 5. అదృష్టం చెప్పిరాదు, దురదృష్టం చెప్పి పోదు (ఎ), దేవుడు వరమిచ్చినా పూజారి వరమీయడు (బి), 6.

## మహాగ్ని జ్వాల

ఉత్తర ఆఫ్రికా అల్జీరియా సహారా ఎడారులలో గస్సిటుయిల్‌లో వాతావరణంలో వాయువులు నవంబరు 13, 1961 రోజున నిప్పు అంటుకుని ఏప్రిల్ 28, 1962 ఉదయం 9-30 దాకా మండుతూనే ఉన్నాయి. ఈ మంటలు 250 అడుగుల ఎత్తుకు పొగ 600 అడుగుల ఎత్తుకు లేచాయి; చివరకు ఆ మంటలు 225 కి గ్రా. డైనమైటును ఉపయోగించి అమెరికా హూస్టన్‌కు చెందిన పాల్‌నీల్ 'రెడ్' ఆడియార్ ఆర్పగలిగాడు. ఇతడు 10 లక్ష డాలర్లు ఫీజు వసూలు చేసాడు.

"మించిన పనులకు నేరము లెంచం బనిలేదు."

వామన (బి), 7. సందిగ్ధము, 8. వారికి నంబర్లు ఉన్నాయి కాబట్టి.

విజేతలు-మూడవ బహుమతి: డి.వి.వి. ఈశ్వరరావు, మేలుపాక (విశాఖపట్టణంజిల్లా)

మాటల మహిమ - జవాబులు: 1. అంతఃపురము (ఎ), అంతఃపురస్త్రీ (బి), 2. ఆచూకి (ఎ), జాడ (బి), 3. సంగ్రహము (ఎ). 4. మిట్టిపడు (ఎ), మండిపడు (బి), 5. అతిశయించుట (ఎ), విజృంభణము (బి), 6. దీర్ఘద్వేషము (ఎ), పశ్చాత్తాపము (బి) 7. పారిపోవుట (ఎ), క్రమము తప్పుట (బి), 8. అతిశయము (ఎ), ఆగ్రహము (బి).

విజేతలు-మొదటి బహుమతి: ఎస్.ఎస్. పలి, సికింద్రాబాదు: రెండవబహుమతి: వి. జగదీశ్, వరంగల్: మూడవబహుమతి ఎల్. సత్యనారాయణ, వెంకంపేట (విజయనగరం జిల్లా).

ముఖచిత్రవ్యాఖ్య: మొదటి బహుమతి: జి. జానకిరామ్, విజయవాడ: రెండవ బహుమతి: ఫణీంద్ర, తుంగభద్రాడామ్ (కర్ణాటక): మూడవ బహుమతి: పడాల శివశంకర మూలారెడ్డి, విజయవాడ.

పాఠకుల అభిప్రాయాలు: మొదటి బహుమతి: వి. చక్రధర్, కవిగిరి, (ప్రకాశం జిల్లా); రెండవ బహుమతి: గడ్డం భీమ్‌రెడ్డి, కుమారి బోస్టు, (ఆదిలాబాద్ జిల్లా); మూడవ బహుమతి: సంధ్యాదేవి, విశాఖపట్టణం.

మీరైతే : మొదటిబహుమతి. డి వి ఎమ్. సత్యనారాయణ, దొడ్డవరం, (ప్రకాశంజిల్లా): రెండవబహుమతి: అనంత వెంకటేశన్, మచిలీపట్టణం: మూడవ బహుమతి: ఎమ్. విజయభాస్కర్, వంతకవిటి (శ్రీకాకుళంజిల్లా)

భావపరిచయపోటీ: మొదటిబహుమతి: పెంట సీతారత్నం, శ్రీకాకుళం: రెండవ బహుమతి: ఫణీంద్ర, తుంగభద్రాడామ్, (కర్ణాటక): మూడవబహుమతి: ఎమ్ డి. ఇమాయుద్దీన్, నర్మెట, (మెదక్ జిల్లా).

## సైకిళ్లను తయారుచేసే నాల్గో పెద్ద దేశం భారతదేశం



సాలీనా 55 లక్షల సైకిళ్ళను తయారు చేసే భారతదేశం ఈనాడు సైకిళ్ళ తయారీలో ప్రపంచంలో నాలుగో స్థానాన్ని ఆక్రమించింది. భారతీయ రోడ్లమీద 250 లక్షల సైకిళ్ళు తిరుగుతున్నాయి పెద్ద సెక్టారులలో 7 సంస్థలలో పూర్తిగా సైకిళ్ళు నిర్మించబడుతుంటే, 60 సంస్థలలో సైకిలు విడిభాగాలు తయారు చేస్తున్నారు. చిన్న సెక్టారులలో 300 సంస్థలు ఉన్నాయి.

"నిష్కాపట్యమైన మంత్రాంగం చెమ్మలేని నీరువంటిది." -జోసఫ్ స్టాలిన్

EDITED AND PUBLISHED BY K. V. GOVINDA RAO
AT No. 9, DESIKA ROAD, MYLAPORE, MADRAS-600 004 (INDIA)
PRINTED BY D. SRIDHARA RAO, AT KRANTI PRESS.
2, FRANCIS JOSEPH STREET. MADRAS-600 001 (INDIA)

